శ్రీరస్తు

# బాలనాగమ్మ

[ ఏడంకముల నాటకము ]

గ్రంథకర్త

చెఱుకుపల్లి వేంకటరామయ్యగారు

మొదటి కూర్పు 1000




ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

సంస్కృతాంధ్ర బుక్ డిపో, (స్థా.1882) రాజమండ్రి.





1946

వెల 3-00

# ఈ నాటకంబున వచ్చు పాత్రలు.

## పురుషులు.

నవభోజరాజు—బాలనాగమ్మ తండ్రి
కార్యవర్ధిరాజు — బాలనాగమ్మ భర్త
బాలవర్ధిరాజు—బాలనాగమ్మ కుమారుడు
పులిపట్నపురాజు—బాలవర్ధిరాజు మామ
మాయల మరాఠీ—బాలనాగమ్మను చెఱబట్టినవాడు
మాయాజంగము—మరాఠీ వేసిన వేషము
జటంగమహాముని—ఒకముని
నాగేంద్రుడు · భూలక్ష్మీదేవికి వరమిచ్చిన సర్పరాజు
తిలారిరాముడు —పానుగంటిపట్నమున పహారీకాయువాడు
మంత్రి—పులిపట్నపురాజు మంత్రి
తిప్పడు – పులిపట్నములో ఒక చాకలి

## స్త్రీలు

భూలక్ష్మీదేవి—నవభోజుని భార్య బాలనాగమ్మ తల్లి.
మాణిక్యాలుదేవి—నవభోజుని రెండవభార్య
చిన్నసూర్యనాగమ్మ }
చిన్నబాలనాగమ్మ } నవభోజుని కొమార్తెలు
పెద్దసూర్యనాగమ్మ }
పెద్దబాలనాగమ్మ } డిటో
గాండ్లసంగోజీ—మరాఠీ ఉంపుడుకత్తె
తంబళ్ళపెద్దు—మరాఠీకి పువ్వులమాలలు కట్టునది.
కాళికాదేవి —బాలవర్ధిరాజునకు వరములిచ్చిన దేవత
సితాలి—తిప్పనిభార్య

ఇంకను సందర్భానుసారముగా మరికొందరు స్త్రీపురుషులు వత్తురు.

# నాటకులకు హెచ్చరిక

ప్రథమాంకారంభమున ఇరువురు దాసరులచే నీ పాట పాడింపవలెను.

ప్రతిపాదము చివరను తందానే తందానే అని చదవవలెను.

శ్రీ భూమి దేవికి । స్థిరమైన వసతి ।తందానే।
భూచక్రపట్నంబు । పోలుపొందు శిరుల ॥తం॥
రాజధానిగ జేసి । భోజరాజేమి ? ॥తం॥
పాలింపుచున్నాడు । బహుసమర్థమున ॥తం॥
ఆ రాజు కిల్లాలు । అరుంధతి సాటి ॥తం॥
భూలక్ష్మి దేవమ్మ । పూబోడిసుమ్మ ॥తం॥
సంతానమును లేక । చాలచింతించి ॥తం॥
పతియాజ్ఞచేబోయె । పడతి కానలకు ॥తం॥
మునివరు గనుగొని । ముదితసంతతిగోర ॥తం॥
ఆడబిడ్డలుగలుగ । ఆ ముని బలికే ॥తం॥
నాలుగుమద్దుల । నడుమ నొకపుట్ట ॥తం॥
అ పుట్టపై నొక్క । ఆమ్రవృక్షంబు ॥తం॥
దాని ఫల బులు । తగనేడు గోసుక ॥తం॥
తిన్నగర్భంబగు । తీరునుజెప్పె ॥తం॥
లక్ష్మి దేవిఫలము । లాలసబుద్ధి ॥తం॥
గోయంగ. నాగన్న । కోపించి పలికె ॥తం॥
నా యాజ్ఞపొందక ! నాతి యీ ఫలము ॥తం॥
ద్రుంచితి కాననిం । ద్రుంతు నీ జగతి ॥తం॥
అన విని కంపించి । అంజలిబట్టి ॥తం॥
భూలక్ష్మిపలికెను । బోగేంద్రుడ
చావుసిద్ధంబన సతి చింతబొంది ॥తం॥
సమయంబుచేసెను । సర్పంబుతోడ ॥తం॥



శుభమస్తు.

# బాలనాగమ్మ

## ప్రథమాంకము

### నాంది

సూత్రధారుడు—(ప్రవేశించి)

చ॥ శిరమున నెమిన్న నాకకటు • సీమను భీకర వ్యాఘ్రచర్మముం
కరములశూలమున్ డమరు • కంబును దాల్చుచు భూతనాథుడై
గిరిసుత వామభాగమున • కేళిమెయిం ధరియించి జంగమై
వరమశివాఖ్యచేఁబరఁగు • బ్రహ్మము మీకిడు సర్వశ్రేయముల్

(సభపై పుష్పములు జల్లును)

ఓహో! ఏమినాభాగ్యము. ఈసభాసదులు నన్నుపిలిచి 'యీవసంతకాలమున సకలజనమనోహరంబైన నాటకంబొండు, ప్రదర్శించి మమ్ముల నానందపెట్టు' మనిరి. ఏనాటకంబును వీరి మెప్పింతును? (అని యోచించి) ఆడువారి కాడువారి సాయము లేకున్న ముందాట సాగదు. కాన నా ప్రత్నేయసిని బిలచెద. నటీ! నీసింగారమైన నొకపరి యిటురమ్మా.

నటి:—(ప్రవేశించి) నాథా! శృంగారము పూర్తి కాక మునుపే పిలచు నవశ్యక మేమి కలిగినది?

సూ:—సతీ! ఈ సభాసదుల యాజ్ఞయే యిట్లు తొందర పెట్టినది.

న:—నాథా! ఈ సభ్యుల యానతి యేమని?

సూ:—'సకలజన మనోహరంబైన నాటకం బొండు ప్రదర్శింపు'మని.

న:—(కొంచెము విసుగుతో) మగవారికి యుక్తాయుక్త వివేకము లుండదు.

సూ:—ఏమటులంటివి?

న:—పాపిడి సరిగా దిద్దుకొనలేదు సిగముడువలేదు పుష్పాలు తురుమ లేదు, ముఖము సబ్బుతో రుద్దుకొని ఫేస్ పౌడరు చల్లుకొన లేదు. అందముగా తిలకము దిద్దుకొనలేదు. సన్నని వలువలు గట్ట లేదు. దవళకంచుకము దాల్పలేదు. ఇంకను తారహారములను ధరింప లేదు.

సూ:—ఉండుముండుము! పిల్లలుగల మన కెందుల కీయలంకారములు?

న:—ఆడువారి కలంకారమే యక్కర లేదా?

సూ:—ఓహో! నీ కెక్కువ మాటలాడిన నేమి చెప్పవచ్చును? పిల్లలు లేనివారి మాట నే జెప్పినది.

(నేపథ్యమున)

కుశీలవా! నీవన్న మాట సత్యమే. ఎన్ని యలంకారములున్నను సంతానము లేని ఆడువారి జన్మము వ్యర్థము.

సూ:—(ఆలించి) తరుణీ! మన కమల భూలక్ష్మి భూమికదాల్చి యిటు వచ్చుచున్నది. మనమింక త్వరపడవలెను. (సభ్యులవంక దోసిలొగ్గి) ఆర్యులారా! మీకు చిరపరిచితుండగు చెరకుపల్లి వెంకటరామ

యార్యునిచే రచింపఁబడిన 'బాలనాగమ్మ' యను నాటకంబు మీకు కర్ణరసాయనంబుగఁ బ్రదర్శింప మమ్మనుగ్రహింపుఁడు. (అని నమస్కరించి యిరువురు నిష్క్రమింతురు)

రంగము - 1 భూచక్రవట్నము. భూలక్ష్మీదేవి అంతః

పురము (సోఫాపైగూర్చుండి భూలక్ష్మి ప్రవేశించును)

భూలక్ష్మి: —ఆహా! ఆడుజన్మ నెత్తుటయే నీచము అందును అనుకూలవల్లభ్యము లేకుండుట నీచతరము. సంతానము లేకుండుట నీచతమము. ఎంతభాగ్యమున్న నేమి? ఎంత వైభవమున్న నేమి? సంతానభాగ్యమున్న కదా యివన్నియు శోభించును. ఆహా హా!

చ॥ కలకలలాడుచుం దనము ♦ ఖంబున లే నగవొప్ప చూడ్కుల
న్మలవాచు వాలకైరవము ♦ మాటికి మాటికిఁ బట్టఁ జూచుచు
న్బలుకు వహించు చారుతర ♦ మోహనమూర్తులచిన్నిముద్దు బా
లల గనఁ గల్గిదే కదని ♦ లౌకికసౌఖ్యము ధన్యజన్మమున్॥

నా కిట్టి యదృష్ట మీజన్మమున పట్టలేదు, లేకున్న—నే నోర్చిన వ్రతఫలంబు లేమయ్యె—దానఫలంబు లేమయ్యె—ఉపవాసనిష్ట లేమయ్యె— తీర్థయాత్రా ఫలంబు లేమయ్యె—సూర్యనమస్కారము లేమయ్యె—పౌర్ణమి నాఁడొనరించిన చంద్రపూజ లేమయ్యె - ఇలవేల్పుల మ్రొక్కుబడు లేమయ్యె - దేవతాప్రతిష్ట లేమయ్యె - అనమాన బ్రహ్మోపదేశమంత్రజపంబు లేమయ్యె - ఇవన్నియు బూడిదలో పోసిన నేతివలె వ్యర్థమయ్యెగదా! పరమేశ్వరా కమలకానందరాశియగు నొక నిసుంగును ప్రసాదింపవైతివికదా! నలుగురతోఁ బేరంటమునకుఁ బోయినప్పుడు "అమ్మా! నీ కెందరు పిల్ల" లన్న మనస్సు నీరుగార శిరంబువంచి "లే" రనవలయుఁగదా! ఆహా! ఎట్టి దుష్కర్మ మొనర్చితినో తండ్రీ! దీనదయాపరా! భువనరక్షా ధురీణా! శ్రీమన్నారాయణా! కామితార్థ ప్రదాయకా! నాయకా!

( నవభోజుఁడు ప్రవేశించును. )

భూల :—(చూచి) మన్మనోహరుఁడేతెంచుచుండెను నావి చారమూయనకుఁ దెలుపరాదు. (లేచి) నాథా! రాజకార్యనిర్వాహ ణాతిక్లేశ స్వాంతులగు తమరీ యాసనమున మనశ్శాంతి జెంద నపేక్షింపుడు శరీరాయాసము వాయ నే నీవ్యంజనంబున విసరెదను

న-వ: —(సోఫాపైఁ గూర్చుండును.)

భూల :—(విసరుచుండును.)

న-భో :—రమణీమణీ! నేఁడొక విజ్ఞాపన పత్రము పురపాల కునియొద్దనుండి వచ్చినది.

భూల: —ఏమని ?

న-భో: —" మనరాజధానియందు నొకధిగుప్తుఁడను నోడచే వారినవనిధులు కలిగి రాజరాజ సమానుఁడై యుండెను".

భూల: —అటులయిన మనము గర్వింపవలసినదే.

న-భో" వాఁడు విదేశంబునకరిగి అకాలమృత్యువాతఁబడెనట"

భూల :—హా! ఎంతకష్టము ?

న-భో: —" వాని భార్యయు దూతముఖంబున నీ శృతివిచారణ వార్తవిని యనల ప్రవేశ మొనర్చినదట. "

భూల: —ఆహా! పతివ్రతా శిరోమణియన నామెయేకదా ?

న-భో: —" వానికి సంతానము లేనందున వాని భాగ్యంబం తయు మన యధీనం బయ్యెననియు దానిని బొక్కసంబున జేర్చుట కాజ్ఞయి" మ్మనిరి.

భూల: అక్కటా! ఎంతపాపము. మనమే కాకుండ యింక నిటువంటి దురదృష్టవంతులున్నారా! నాథా! ఆనిస్వంతు ద్రవ్యము మన ధనాగారంబున చేర్పవలదు. ఐన మీరేమంటిరి,

న-భో: —ఏమనుట కేమున్నది. "ఆధనంబతియు అనాథ బాలబాలికలకు భోజన విద్యాలాభాది సత్కార్యములకు వినియోగించుచు, కొందరు ధర్మాత్ముల పర్యవేక్షకర్తలుగ నియమించి వారే పరిపాలించు"డని యాజ్ఞాపత్రి యంపుమని మన ముఖ్యసచివున కనుమతి యిచ్చితిని.

భూల: —సెబాస్. ప్రాణేశ్వరా! సెబాస్. మంచిపని చేసితిరి

న-భో—సతీ! వానివని నేడట్లుండనీ! రేపు మన రాజ్యపరిపాలకు మాత్రము, అంగుష్టమాత్రుండైన పుత్రుండుగూడ లేడుగదా! ఆ విచారంబె యుల్లంబున పెల్లుగ బాధించుచున్నది

భూల: —నాథా: ఇంతవరకు నేను సంతానాభావమును గూర్చి చింతించుచుంటిని.

న-భో:—ఎంత వైభవమున్న నేమి? సంతానభాగ్యమే భాగ్యము

గీ॥ వీథులో బాలకులతోడ • నేడ్కయాడి।
ధూళిమూసరి తాంగుడై లీలవచ్చి।
తాళ్ళదడ్డవడు సుతాను • గ్రక్కున నెద।
జేర్చు భాగ్యంబుగా కెద్ది • సిద్ధమగునొ॥

భూల: —నాథా! మనమట్టి యదృష్టవంతులము గాము. (కొంత యోజించి) ప్రాణేశ్వరా! నా విన్నప మొక్కటి పాలించెదరా?

న-భో :—అది యేదియో చెప్పుము.

భూల :—నిరంతర రాజకార్యనిర్వహణ మంత్రాలోచనాంతఃకరణులగు దేవరను దపంబు సేయం బనుచుట ధర్మంబుకాదు. త్వదీయ సహధర్మచారిణి నగు నేనరణ్యంబున కేగి పరమేశ్వరప్రసాదంబున సంతానలాభంబు వడసి వచ్చెద. నన్ననుగ్రహింపుడు. (అని కాళ్లపైఁబడి నమస్కరించును.)

స-భో :—(శ్రీదేవి గద్గద స్వరమున) వనీరత్నమా ! కుసుమ కోమల కోమలాంగివగు నీవెక్కడ ? కఠినఘోరసాంద్రారణ్యమెక్కడ? తపంబెక్కడ ? పరమేశ్వర సాన్నిధ్యం బెక్కడ ?

సీ॥ కమనీయ మంజుల ♦ గాన వీచిక గాదు
శార్దూలభీకర ♦ స్వనముగాని
శుకశారికాదుల ♦ శుభవిహారము గాదు
భేరుండ పక్షుల ♦ వితతిగాని
మృదుకుసుమ పరాగ ♦ మిళిత భూస్థలిగాదు
తతవేణుకంకటా ♦ వృతముగాని
రంజితమల్లికా ♦ కుంజపుంజము గాదు
మొండ్లతో గూడిన ♦ పొదలెగాని
గీ॥ [illegible] ♦ కాంతిగాదు
వెలుచ వర్థిల్లు కాననా ♦ సలముగాని
కావు ఆరామవనములు ♦ కావు కావు
కఠిన కర్కశ వనములు ♦ కాని సుదతి!

గట్టిగ చప్పుడైన నెంతయో భీతిల్లు భీరురాలవు, ఘోరసత్వారావంబులను భయమందక ధీరత్వంబున మార్గము కానరాకారంబున నిల్లుమనగలవు ? అయ్యో ! ఎంత కష్టము. (శరీరము నిమురుచు) శరత్కాలేందు కౌముదికి శరీరము వడదాకు నీవు — మృదులతూలికా శయ్యల నత్తమిల్లిన "ఒడలు నొచ్చె" నను నీవు — కుసుమసుకుమార సుకుమారముగల నీవు - చండచండ కిరణజాలంబుల కోర్వగలవా - కటికరా నేలల బండగలవా - సాంద్రతరుజాలంబుల మధ్యనుండి జాగిపోగలవా - వలదీయత్నము, ఎప్పటికైన నా జగన్నాధుని యనుగ్రహము మనపైఁ బ్రసరించినపుడు సఫలీకృత మనోరథుల మగుదు మంతియ కాని యిప్పుడీ యత్నము మాత్రము మానుము.

భూల: — నాయనా! నాముద్దు తీర్పింపరా? మీరాకర్షింగినగు వారును నింత చూపుగఁదుం ఎంత కష్టించియైనను సంతానలాభవరంబు సాధించి వచ్చెదఁ నా కాశీస్సు లొసంగుడు.

వ-భో: — అయ్యో! వెఱ్ఱిదానా! ఎంతబేలవే, అకొండ కానలవ లోని నీటిని దాగి, వన్యఫలంబుల భక్షించి, శీతాతపంబులకు తాళి, సాహసించి, యెట్లు చరింతువే, అబలా?

భూల:—ప్రాణప్రియా! కష్టింపకున్న ఫల మెట్లుదక్కును?

వ-భో: —ఎంతచెప్పిన నీ పట్టు విడువకున్నావు. "సాహసంప ద్గుణంబైన" అన్న వారోక్తి వ్యర్థము కాదు (శిరమున హస్తముంచి) సూర్యచంద్రాదులు, పంచభూతములు, వనదేవతలు, మునీంద్రులు, నిన్ను సదా రక్షింతురుగాక ఫలప్రాప్తి బొందిరమ్ము.

భూల:—నమస్కరించును. (తెరపడును)

రంగము - అరణ్యము.

భూలక్ష్మీదేవి ప్రవేశించును.

భూల:—ఆహా! పుత్రవాంఛ ఎట్టి కష్టనిష్ఠురములకైన వెను దియ్యనియ్యదుకదా! కానిమ్ము. నామనోరథంబీడేరిన నీబాధ లోక లెక్కలోనివి కావు (కాళ్లు చూచుకొని) పాదము లెంతెంతబొబ్బలెక్కినవో? శ్రమం బధికంబగుచున్నది. ఇఁక ముందు నడువజాల. ఈ కాననంబు నిర్జనంబుగ గన్పించుచున్నది. ఏదారిం బోవుటకు దోచకున్నది. దాహాభరం బధికంబగుచున్నది. నను బ్రోచువారిం దెవ్వరు లేరా, అయ్యో! భయముచే శరీరము కంపించుచున్నది. ఏమియు దోచకున్నది ఎందుజొత్తును. ఎవ్వారి శరణంబు జెందుదును. (అనినడచుచు) అల్లదె దూరంబున ధూమజాలంబు మింటి కెగయుచున్నట్లున్నది. ఏదైన గ్రామంబు కానచ్చును. (అని నడచుచు ముందుచూచి) ఎవరో మునీంద్రుండు కాంబోలు దేహంబంతయు భస్మధారియై అవర

శిష్యుఁడో యీన నావృత్తచ్ఛాయను తపంబొనరించుచున్నాఁడు. నమ
స్కరించెదగాక. (అని సన్నిధిలోనున్న మునిని సమీపించును)

భూల ;—మునిలోకగ్రామణీ ! అభాగ్యురాలనగు నేనిదే నీచ
రణకమలంబులకు నమస్కరించుచుంటిని. (అని నమస్కరించును)

ముని :—(మారుపలుకకుండును)

భూల :—తండ్రీ! నాపై దయలేదా? నీమున్న నన్ను నేనాపాత్రు
రాలను కానా? లేకున్న వ్యాంధ్యనని నాతో మాటాడవొల్లవా?
నన్నుద్ధరింపవా? ఎంత ఘోరము! ఎంత నీచము. నే నెంతపాపంబొన
రించితినో, దయాసముద్రులగు మీకటాక్షవీక్షణంబు నాపై నెం
దుకు బ్రసరింపదు. నాయనా! నీపాదసేవ జేయుట కనుజ్ఞ నీయవా?
ఓ తలిదండ్రులారా! ఇట్టి నిర్భాగ్యురాల నెందులకు గంటిరి. అయ్యో
దైవా! మీరేమి చేయుదురు? ఉగ్గుపాలు పోసి పెంచుదురుగాని
పూర్వకర్మానుభవంబునకు మీరు కర్తలా? ఓ మునికులచంద్రమా!
స్వామీ! నామొరాలకింపవా? (అని గట్టిగా నరచును)

ముని :—(మాటాడకుండును)

భూల: —అక్కటా! ఏమియు దోచుట లేదు. ఈ మహాను
భావునకు నాపై గోపమున్నదా? లేదు లేదు. సర్వసమానులుగదా తాప
సేంద్రులు. దైవసాక్షాత్కారంబునందిన వీరికి లోకవ్యవహారములో బని
లేదు. వారి ధ్యాననిష్ఠయే వారిది. ఇది యెంతయు నసాధ్యోదయంబే:
(ఇంచుక యోచించి) ఈ పని నిట్లు ప్రసన్నుని జేసుకొందును? ఐన
నిట్లు చేసి చూచెదగాక (అని రెండు పొక్కళ్ళను మూడుపొక్కలికి
తన కాలునుంచి అన్నము వండుకొనబోవుచు వేడి తగలగానే కాలు
తీసి వేయుచు బాధపడుచుండును)

ముని: —(కనులు తెరచి చూచి తనలో) ఈ సుకుమారి యె
వ్వతెయో? ఎందులకువచ్చి నన్నాశ్రయించినదో? ముగ్ధలాగున్నది.

వంటచేసుకొనుటగూడ దెలియునట్లున్నదే? (ప్రకాశముగా అమ్మా! నీ వెవతవు? ఎందుకొరకిట శ్రమపడుచుంటివి? నీ వృత్తాంతంబు సవిస్తరంబుగ నుడువుము.

భూల :— (లేచి నమస్కరించి) తండ్రీ! నేటికి స్వామి ననుగ్రహాము కలిగినదా? నా జన్మము ధన్యతనొందినది. పూర్వానుభవంబున నొనరించిన సుకృతంబు ఫలించినవి. స్వామీ! యీ దీనురాలి చరితము వినదలంచితివా ప్రభూ! భూచక్రిపట్టమేలు నవభోజుని సతిని. సంతానవాంఛ నిన్నాశ్రయించితిని. నా కోరిక సఫలముగావింప నీకిదే నమస్కారశతంబు. (అని నమస్కరించుచున్నది.)

ముని :—అమ్మా! (కొంతతడవు ధ్యానించి తనలో) ఈమెకు సంతానంబుకలుగు యోగ్యతలేదు. ఆడసంతతిను నీమెయు మగసంతానంబున నీమె భర్తయు మరణింతురు. వీరి కర్మ మిట్లున్నది. ఏమి చేయవచ్చును. "సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయాత్ నబ్రూయాత్సత్యమప్రియం, ప్రియంచనానృతంబ్రూయాత్ ఏషధర్మ స్సనాతనః" అని శ్రుతులు ఘోషించుచున్నవే. కావున అప్రియంబు నానోట వచింపరాదు. (ప్రకాశముగా) తల్లీ! నీ కోరిక సఫలముచేయు మార్గమున్నది. అది నా వల్ల కానేరదు. కాని ఉపాయముమాత్రము చెప్పెదను.

భూల :—మునిమార్తాండా! నా కదియె పదివేలు. సెలవీయ కోరెదను.

ముని :— ఇచ్చటికి కనతిదూరంబున నాలుగు మద్దులమధ్య నొక పుట్టయు దానిపైన ముంతమామిడిచెట్టునుగలదు. దాని ఫలంబులేడు కోసికొని యింటికివెళ్ళి వాని రసంబు త్రావుము. నీ కేడుగురు సుతు లుద్భవింతురు పొమ్ము. (అని నిష్క్రమించును.)

భూల :—చిత్తమనుగ్రహింపఁ బడితిని. (అని నమస్కరించి పరిక్రమించుచు) ఇఁక నేను కృతార్థనైనట్లే. అల్లదె మద్దులు. (తెర

యెత్తగా పుట్టయు ఫలభరితమై జీడిమామిడిచెట్టు కన్పించును.) ఈ చెట్టుపై కెక్కి ఫలంబుల గోసెదను. (అని చెట్టుపైకియెక్కి వడినింక బండ్లు కోసికొని దిగిచూడగా యేడు పండ్లుమాత్రమే యుండును.) అయ్యో! పండ్లన్నియు నేమైనవి. తిరుగ కోసి చూచెదగాక (అని పండ్లు కోయగా యేడుపండ్లుమాత్రమే యుండుటచూచి ఈమారు గూడ పరిక్షింతు. అని చెట్టుఎక్కి పండ్లు కోయుచుండును. పుట్టలో నుండి నాగేంద్రుడు బయలువెడలి చెట్టుపైకి బ్రాకును. లక్ష్మినవ .చం నమస్కారము చేయును మనుష్యరూపుడై)

నా :—నా యనుజ్ఞలేనిదే ఈ వృక్షారోహణంబు గావించి యుందలి ఫలంబుల దెచ్చెంచు నీ వెవ వెవ్వు?

భూల :—తండ్రీ! నే నొక యభాగ్యురాలను. సంతానము లేకుండుట నీ దుర్గమ కాంతారంబునకు జనుదెంచి. జంగిట మునీంద్రుల శరణంబుజొచ్చి వారి వాక్యానుసారంబుగ నీ తరు వధిరోహించి, ఫలం బుల గోసితి. నన్ను మన్నించి రక్షింపుము.

నా :—ఓసీ! మూర్ఖురాల! నా కరాళదంష్ట్రావిషానలంబున నిన్నిప్పుడమడియజేసెద చూడుము.

భూల :—నా కోరిక వ్యర్థపరతువా తండ్రీ! నే నెంత [illegible] తినోకదా? రక్షింపుము. రక్షింపుము. దీనురాల బిడ్డలగని వారి ముఖ ముఖంబులుచూచి కొండంత యానందము జెందగలనని మురియుచుం టిని, అదిఅంతయు స్వప్నప్రాయమయ్యెనా స్వామిా! నన్ను గీటడంచి నందున నీకు వచ్చు లాభమేమున్నది?

నా :—బోటీ! నీ వెన్నిచెప్పిన చావుతప్పదు. నిర్మలంబుగ భగవధ్యానంబు చేసికొని మరణంబునకు సిద్ధంబుగ నుండుము.

భూల :—అక్కటక్కటా! నే నెంత వెర్రిదానను. "జాతస్య మరణం ధృవ" మ్మను నార్యోక్తి మరవవచ్చునా? నూరేండ్లకైనా

జావు తప్పదుకదా! ఇందుల కింతభయంబేల? (అని యోజించు చుండును.)

నా:—ఓ కాంతా! సర్వసంగపరిత్యాగివై మరణంబునకు సిద్ధమైతివా?

భూల:—తండ్రీ! నాకు మృత్యువు దప్పదా?

నా,—తప్పదు, ముమ్మాటికి తప్పదు. ఇది సత్యము.

భూల:—ఏమయిన సత్యంబుజేసిన నన్నిపుడు వదిలెదవా?

నా:—ఏమి సత్యంబు చేసెదవు?

భూల:—తండ్రీ! బిడ్డలగనువేడుక తీరలేదు. కావున సంతానముగన్న తొమ్మిదవనెలనాడు శేషపౌర్ణమిని నాయుసురుల నీకు సమర్పించెద. ఇపుడు విడువుము నాటిరోజున తప్పకుండ నన్నుగరచి యంతమొందింపుము.

నా:. (యోజించి) నాడు నాబారినుండి తప్పుకొన లేవుసుమా!

భూల:—ఈ కర్మసాక్షిసాక్షిగ— పంచభూతంబులసాక్షిగ—వనదేవతలుసాక్షిగ—నా ప్రాణనాధుని పదములుసాక్షిగ— నీ పాదకమలయుగంబుసాక్షిగ—శపథంబుచేయుచున్నాను, నాటిరోజున నీకాహారమయ్యెదను. నన్ను మన్నింపుము.

నా:—అట్లయిన సరే పొమ్ము. (అని నిష్క్రమించును.)

భూల:— ఇప్పటికీ గండము గడచితిని. ఈ వార్త నానాధునకు తెలియనీయరాదు. (అని నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.



శుభమస్తు.

# బాలనాగమ్మ

## ద్వితీయాంకము

### రంగము — భూచక్రపట్నపరిసరము

గ్రామవాసియగు నొక తురక ప్రవేశము.

గ్రా :—అరే అల్లా! అల్లా! ఎంతపనిచేసినావ్, ఎంతపనిచేసినావురే. నీది నమ్మ ఏమిమునిగిపోయిందీ. అదే నీది కన్ను మనుగాను. నీ కంట్కే మా లచ్చుమమ్మ కన్పించిందిరా. అరే! అరే! హెంతపని జర్గింది. ఎంత అదురుష్టంపోయిండి. హింత హన్యాయ్యాం హింత ద్రోహం తల్చాడురా ఖుదా! అరేరే యేష్టుర్ ఆడబిడ్డల్ తల్లిరానాయనా! అరే! తొమ్మిదినెల్లపిల్లలేరా! ఎంతపనిరాబాబూం! అయ్యో! నవాభోజరాజా! ఏలా బతుకుతావు? నీ మాలచ్చిమి ఎగిరిపోయింది. అయ్యో! అయ్యో! ఎంత తంతరాలేపన్నినా కార్యంచెలేగయా? అయ్యో! దేముడా! అంత చల్లనితల్లి యేట్ల నచ్చిపోవడమెక్క నీ కాసమండిపోనూ బమ్మదేవుడా! ఎంతపనిచేసినావురా! అరే మంత్రీజీ! నీ హాలోచనకీ హన్నియే బుగ్గిలోపడ్డాయిరా నీ పన్నికకీ హన్నఋఘూంటట్ అయ్యాయి. ఒంటిస్తంభభామ్మర దూలంతగిల్చి బంగార్పు గొల్సుకీ సంధూక్ బం

ఘించి. హమ్మగార్ని అందులో పూరించే అంతరిచ్చంగా యేలాడతీయిం చినంతాబంగూకుల్ పక్కి నాటకాల్ యెన్క పురండాల్, చుట్టు బందోబస్తు ఫిరంగుల్, ఊర్కి బైట కానలాల్ అగ్గిగుండాలే యెన్నో యెన్నో పనుల్ గరేఁసోబీ అన్నీ చణంలో (అని గుండె కొట్టుకొని అంత నొక హూర్కారా ప్రవేశించును)

హా :—అరే నబీసు! ఎందుకురా అలా. హడల్తావ్.

క :—(వినిపించుకొనక) ఎంతమంత్రి మంతరగాళ్లు వచ్చార్. సేతుల యారకడాల్, కాళ్ళకు గండపెండాల్, యూపూతి మంతరిం చార్ జనూల్ మంతరించార్ యెవాకు యెన్ని సెట్లు బోడిసేసార్ ఒక్టి ఒక్టి లాభం నహీ హై. ఒకరి కర్మం తప్పించడాన్కి ఒక్డు కర్తా క్యాహై (అని విచారించుచుండును.)

హా :—(భుజముపై దట్టుచు) అరే కరీమ్! సంతోషంవేళ ఈ యేడ్పు లేలరా?

క :—అరే చంతోసం చంతోషం కహాఁహో, మా రాణీ గారు లచ్చుమమ్మ సచ్చిపోయినార్. బిడ్డల్ రెక్కల్ లేని పచ్చుల్, మాకీ చంతోసం హెక్కడనుండి జే వస్తాదీ. అంతా వాచ్చలియంగఅపల్లి మళ్ళీ దేక్తాసహేఁ.

హా :—ఓరీ! వెఱ్ఱివాఁడా! మన మహారాజుగారికి ద్వితీయవి వాహము మాణిక్యాలదేవితో అయినది, వారు జనానాతో పురప్రవే శము చేయుదురు పుర మలంకారము చేయింపుమని నా కాజ్ఞా పించినారు.

క :—(ఆశ్చర్యముతో) రాజా సాహేబుగోరూ సరీ శాదీ ఠీక్ బోలో,

హా :—నిజముగా.

క :—హో ! నవాభోజారాజా ! ఎంతపనిచేసినాన్. హమ్మగారి దగ్గి మళ్ళీపెళ్ళీ సెస్కానేరీ లేందని హెన్ని హెన్ని పమానికాల్ చేసి అంతా ఝూట్ బాత్ సెసావ్. రాజూల్యూ అచ్చాబురానహో హైం. ఆరు పబువులుగమ్కా హోల్నిమూచించరాద్.

హ :—ఈ సంతోషవార్త పురమున చాటింతము రమ్ము.

క :—అరే చంతోసం మూకీరు దుఖ్ఖం రెండోపెళ్ళిఆస్తే పిల్లల్ని చక్కంగా సూస్తుందా ! రాజాకీ పేమ్రసేస్తుందా హెందూక- పెళ్ళీ పెళ్ళి ! పిల్లల్ గలాడ్కి దూగురీశాదీ ? శాదీ ! అరే మేరే శిర్ నక్కా సాహాగయా ! తూజా మైం జాతాహూం (నియతి ప్రవేశించును) ఇరువురు నిష్క్రమింతురు.

ని :—నేను అదృష్టదేవతను. నాదయలేక పోవుటచే భాగ్యలక్ష్మి దేవి మరణించినది. నాకరుణ యీ పిల్లలయందు గలదు. వీరిని మాణిక్యాలు దేవి యెట్లు బాధించునో చూచెదగాక.

(నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

---

రంగము—మాణిక్యాలు దేవి అంతఃపురోప్రాంతము.

సోఫాపై గూర్చుండి మాణిక్యాలు దేవి ప్రవేశము.

మాణి :— ఆదుష్ట భూపతికి నాపై ప్రేమ లేనిచో నన్నెందులకు పెండ్లాడవలెను ? నన్నిట్లు అవమానించిన దన కేమి లాభము ? కానిమ్ము ఎప్పటికైనా దాసుని జేయకుందునా ? (ఆలోచించి) ఇట్లుచేసిన తనకు తానై నావెంటబడడా ఆ మాయపిల్లలు నా కెక్కడ దాపురమైరి.

—: సూర్యనాగమ్మ బాలనాగమ్మ ప్రవేశింతురు :—

బా నా :—అక్కా ! మన తండ్రిగారు ఢిల్లీచక్రవర్తిగారి దర్శనమునకు వెళ్ళేదరట. వారితో మనముగూడ వెళ్ళి అక్కడి వింతలు చూచి వత్తమా ?

సూ నా :—బుల్లి చెల్లీ ! అలాగే వెళ్ళి వత్తము. ఎందులకో మన పిన్ని కబురు పంపినది ?

బా నా :—ఎందులకు ? పప్పు బెల్లము, మిఠాయీ, లడ్డూ కోవా, అన్నీ పెట్టుటకు.

సూ నా :—నాకు కొంచెము పెట్టవూ ?

బా నా :—నీవు నాకు పెట్టావూ? నేను పెట్టడానికి బుల్లిఅక్కయ్యకు పెట్టుతాను.

సూ నా .—నా జతవుండకు.

బా నా :—నీకు కొంచెం పెట్టుతానులే నా జతవుంటావా ?

సూ నా : — (నవ్వుచు) అలాగేనమ్మా ? (పరిక్రమించుచు సవతితల్లినిచేరి) పిన్నీ ! మమ్ము నెందులకు రమ్మంటివి ?

మా :—(బాలనాగమ్మను సందిట చేర్చుకొని చెక్కిలిముద్దాడుచు) అమ్మా ! మీ రిద్దరే వచ్చారేం తక్కినవారు రాలేదే.

సూ నా :—చెల్లెళ్లు ఆడుకొంటున్నారు పిన్నీ !

బా నా :—నేను ఆడుకోబోతాను. విడువుము.

మా :—ఏమే యింతతొందర ? మీ నాన్నగారు ఢిల్లీ వెళతారట. నా దగ్గరవుంటారా ? నా దగ్గరఉంటే మీకు మంచిమంచి తాయిలాలు పెట్టెదను.

బా నా :—నాకు పెట్టవూ ?

మా :—నా చిట్టితల్లి ! నీకు పెట్టెదను లే (తనలో) మీకు తొయిలాలుకావు మారణాలు. కుంకముండల్లారా !

సూ నా :—అదుగో బాబయ్యగారు వస్తున్నారు.

న భో :—(ప్రవేశించి) పెద్దకొడకా, సూర్యనాగమ్మా ! చిన్న కొడుకా బాలనాగమ్మా ! యిచ్చటికి యెప్పుడు వచ్చినారు. తండ్రులారా !

మా :—(తనలో) నీ బ్రిదుకునకు కొడుకులుగూడాను. ఈ బాలరండ పైనగల ప్రేమలో 100వ వంతు అనురాగం నాపై లేదుగదా. ఎందుకుంటుంది. ఈ వెధవలపని పట్టనలె. అప్పుడు ... పుట్టె వలె. (ప్రకాశముగా) నాధా ! వందనము ఎప్పుడు ఈ సేనురాలిమాట మీ హృదయగహ్వారంబున జొరదుగాని బాలలి... నున్నారనియైన నిటు వచ్చితిరి. సంతసమయ్యెను.

న భో : (వినిపించుకొనక) సూర్యా ! ...తో ...కివచ్చెదరా ? యిచ్చట మీ పిన్నిదగ్గర వుండెదరా ?

సూ నా :—(మాణిక్యమువైపు చూచును: మాణిక్యము తన యొద్దనే యుండుమని తిరిగి సైగచేయును) నాన్నగారూ ! మా పిన్ని దగ్గరనే యుండెదను.

బా నా :—బాలా ! నీవో ?

బా నా :—నేను నీతో వచ్చెదను

సూ నా :—బాలనాగూ ! మనమందరము పిన్నిదగ్గరనేయుండి వేడుకగా మాటలాడుకొందము. భయమేమిటికే ?

బా నా :—పిన్ని నన్ను కొట్టుతుందేమో ?

మా :—పిన్ని యెందుకు కొడుతుంది ? చక్కగా ముస్తాబుచేసి ఆడుకొనుటకు బొమ్మలు—లక్క పిడతలు — దొండకాయలు— ఇంకా — ఇంకా—(అని పెడనవ్వునవ్వి) (తనలో)మిరపకాయలపొగలు

విషముకలిపినపాలు— నూతిలో దూకించుటలు—వీనికి లొంగకపోతే, కాళికాదేవికి అర్పణములు—ఎన్నో ఎన్నో బహుమతీలు—మారణోపాయములు——

సూ :——మనము ఢిల్లీకివెళ్ళితే నాన్నగారికి శ్రమకలుగుతుంది. గాన యిచ్చటనేయుందము.

బా-నా:——నాకూ యిష్టమేకాని నాదగ్గర ఎవరు పడుకుంటారు?

మా :—— నేను పడుకోనటే వెర్రితల్లీ! అమాయకురాలవు. (తనలో) ఈ రాత్రికి మీరు బ్రతికియుంటేగదా పడకలు.

న-భో :——తల్లులారా! మీరు మీ పిన్నికడనేయుండుడు. నేను త్వరగ పనిముగించుకొని మీకు కావలసిన యాటవస్తువులు—బొమ్మలు దుస్తులు—గుఱ్ఱములు—బళ్ళు—అన్నివింతలు తెచ్చెదను.

బా-నా :——సరే (అని తలయూపును)

సూ : నాన్నా! చెల్లిమాటకేమిగాని మేమంతా పిన్నిదగ్గరనే యుండెదము. నీవు త్వరగా రావలెనుసుమా ?

న-భో :——నా బొంది ఢిల్లీలోనున్నను, ప్రాణములు మిమ్ము బాయవు. మీరు సుఖంబుండుడు. (భార్యనుచూచి) మాణిక్యమూ! పిల్లలున్నారు జాగ్రత్త.

మా :—(తనలో) ఎంతనేపువిన్నా పిల్లలగొడవేకాని నామూటామంచి యెంతమాత్రములేదు. (ప్రకాశముగా) నేనుమాత్ర మెరుగనా ? యిప్పటినుండి పిల్లలబెంగ మీకు లేకుండ జేసెదను

న-భో:— నేను వెళ్ళివచ్చెదను. (పిల్లలముద్దాడి నిష్క్రమించును)

మా :——అమ్మాయీ! సూర్యమూ! ఇవాళ పౌర్ణమిచంద్రుని జూచి పూజిస్తే చక్కని మొగుడు దొరుకుతాడు. మీరువెళ్ళి స్నానము చేసి నీళ్ళుతోడుకొనిరండు. (అని చిల్లులుగల బిందెయు, ఓటుచేదయు నిచ్చి లోనికిపోవును.

బా-నా }
సూ-నా } —(పరిక్రమించుచు)

బా-నా :—అక్కా! నాకేమో చెప్పలేనంత బెంగగానుండెనే.

సూ-నా :—మనతల్లిపోయిననాటనుండియు దండ్రిగారే తల్లికి మారుగా పోషించుచుండుటచే నీకట్లుతోచుచున్నది.

బా-నా :—మనపిన్ని యెప్పుడు మనలచూచిన యేదియో గొణుగుకొనుచుండును. మనమీద గనబరచు ప్రేమయంతయు కృత్రిమముకాని నిజమైన ప్రేమకాదని నా నమ్మకము.

సూ-నా :—కడుపులోలేనిది కౌగలించుకొనినవచ్చునా? ఇంతకు మనము దురదృష్టవంతురాండ్రము.

బా-నా :—(ఏడ్చుచు) అక్కా! తల్లి చచ్చిపోయినది తండ్రి ఢిల్లీకివెళ్ళినాడు. మనగతి యిప్పుడు నూతికి గోతికి మధ్యనున్నట్లున్నది. ఏమిచేయుటకు దోచకున్నది.

సూ-నా :—అన్నింటికి ఆ పరమేశ్వరుడే కలడు. వానిని నమ్మినవారికి శైలంబులవలె వచ్చునాపదలు తుహినంబువలె విడిపోవును. అదె నుయ్యి స్నానముచేసి వత్తమురమ్మ. (ఇద్దరు నూతిదగ్గరకుచేరి చేదవేసి లాగుదురు నీరుకారిపోవును.)

మా :— (ప్రవేశించి) ఓసే సూరీ! స్నానానికనివచ్చి యిచ్చట యేమగనితో కులుకుతున్నారే. బిందెలు నిండినవా? త్వరగ రండి.

సూ :—(మాటలాడకుండును)

బా-నా :—చేద పిగిలినదికాబోలు నీళ్ళు వచ్చుటలేదు.

మా :—కుర్రకుంకల్లారా! చేద బ్రద్దలుకొట్టినారా? దీనిని పగలకొట్టినట్లు మీ బుర్రలు పగలకొట్టితే బాగుండును.

(అని ఇద్దరితలలు నూతిఅంచునవేసి కొట్టును.)

ఇద్దరు—(ఏడ్తురు)

మా :—బిందెలునిండ నీళ్ళు తేకపోతిరా డొక్కచింపివేసెద జాగ్రత్త. (అని నిష్క్రమించును)

ఇద్దరు :—(ఏడ్చుచు) హా! తండ్రీ! ఎంతగతిపట్టినది

స్రగ్విణీవృత్తము—జననీ! జననీ! ♦ చనుదెమ్మిటకున్

ఘనమా వెతలం ♦ గగనయ్యెనుగా

జనకా! జనకా! ♦ చనమేలను నీ

వనుకంపను చ ♦ య్యన బ్రోవగదే.

సూ / బా } —హా ఎంతదుర్గతి. మాకు దిక్కెవ్వరు? ఎవ్వరి వేడుకొందుము ఎవ్వరు మమ్ము రక్షింతురు? పరమేశ్వరా! దీనదయాపరా! అపద్బాంధవా! రఘూధవా! పురాణపురుషా! లోకకల్యాణధామా! పరందామా! నాబోటి అనాధబాలికల రక్షించుట నీకు భారమా! (అని విచారించుచుందురు, బిందెలు నీళ్ళతో నిండిపోవును. వానిని భుజములపై నుంచుకొని వచ్చుచుందురు.)

మా :—(ప్రవేశించి) ఎంతసేపాగరే? మీ కొరకు చూచిచూచి కన్నులు కాయలుకాచినవి. నీళ్ళెక్కడ?

సూ :—పిన్నీ! నీళ్లు నింపుకొనియే వచ్చుచుంటిమి.

మా :—(బిందెలుచూచి ఆశ్చర్యముతో తనలో) ఓటిచేదలకు చిల్లిబిందెలకు ఏమిమాట్లుపెట్టి నీళ్ళు తెచ్చెదరోకదా యీ పడుచులు? తానొకటితలచిన దైవమొకటి తలచునట్లున్నది. (సగర్వము) ఈ మందులమాణిక్యము తలచిన ఎంతపనిచేయలేదు? (ప్రకాశముగా) ఆ నీళ్లు పూజాగృహంబున నుంచుడు.

ఇద్దరు :—ఆలాగుననే పిన్నీ! (అని పరిక్రమింతురు తెరయెత్తగా పూజాగృహము కనిపించును లోనికి వెళ్ళినంతనే వారి నందుబంధించి మిరపకాలగొట్టు పెట్టును దగ్గుచు బాధపడుచుందురు)

సూ } —అయ్యో! దైవమా! ఇది ఏమి ప్రారబ్ధము ఊపిరా
బా } డకున్నదే. అమ్మా! అమ్మా! ఇక్కడ దిక్కులేక
అనాధలమై చనిపోవుచుంటిమి. రక్షింపుము రక్షింపుము. హా లక్ష్మీపతి! చిత్రపరవృత్తము— ఓ కరుణాకర దేవా!

సాకవె తత్వవికాశా!
ఈ కడగండ్లనుబాప
శ్రీకమలాపతి రమ్మా.

ఓ పరమేశ్వరా! పూర్వభవంబునం దెట్టి దుష్కృత్యమొనరించితిమో కదా? ప్రపంచమున తల్లిలేని బిడ్డ లెందరున్నారు? వారిట్లే బాధలపడుచుండిరా? సాపత్నీమాతలుమాత్రము వారికి లేకుండిరా? ఇది అంతయు మేము చేసికొన్న పాపఫలము. ఓ తండ్రీ! జగత్పతీ! రక్షింపుము. అనదలము. అబలము.

(గొట్టుపోయి అత్తరువాసనగొట్టును.)

ఆహా! దీనదయాపరుని అకారణవాత్సల్యము. సర్వము దైవాధీనము.

మా :—(ప్రవేశించి) ఈ యింట్లో కూర్చుని ఆటలాడుకొనుచుంటిరా? ఎంతఅలసిపోతిరో, మీ కొరకే పాలు సిద్ధపరచితిని. శ్రమ ముదీర త్రాగుడు.

ఇ :—పిన్నీ! మా కేమియు బాధలేదు. శ్రమమును లేదు పాలు మాకు వలదు.

మా :—(నవ్వుచు) మీకు పాలు హితవుకావుకాంబోలు. ఎంతయో ముద్దుగచెప్పిన వీళ్లు వినువారలా? నా యెదుట మీ యాటలు సాగిరావు. త్రాగెదరా? లేదా?

ఇ :—మాకు వలదన్న బలవంత మెందులకు? నీ కంతపట్టుదల కూడదు.

మా:—మీ అమ్మయేవచ్చిచెప్పిన నింత మొండిపట్టుపట్టుదురా (అని పాలగిన్నె నిచ్చును) త్రాగివేయుదురు. (తనలో) నీనితో నా శని?

వదలిపోయినది. జిల్లేడుపాలలో సర్పగరళము, వసనాభిచేర్చి యిచ్చితిని ప్రియత్నముచేసిన కార్యసిద్ధి కాకుండునా?

సూ:—చెల్లీ! చెల్లీ! అలాకళ్ళు తేలవైతువేల? నాకును నాలుక తోడుకొనిపోవుచున్నది. మనల జంపుటకై పన్నినపన్నాగమిది ఈ—శ్వ—రా—(అని పడిపోవును)

బా:— అక్కా! నాకు వళ్ళు తెలియుటలేదె. దే—వా—ర— (పడిపోవును)

మా:—(నవ్వుచు) ఇప్పటికిగదా నా మనస్సు కుదుటబడినది. వీరలు జీవించియుండునంతవరకు నా మగడు చెప్పుచేతలలోనికి రాడు. ఇంక ఆయనకు మరుమందు పెట్టుటయే మిగిలినది. అదికూడ కానిచ్చి తినేని ఈ భూచక్రిపట్టణపరిపాలనము నా చేతిలోనికి రాకుండునా? నవభోజా! నన్ను అవమానించినందులకు నీకు తగినట్లు చేసితినికదా? నీ కల్లబొల్లి బెదరింపులకు బెదరి దాసురాలననుకొంటివా? అమ్మయ్య దైవకటాక్షము నాపై గలుగబట్టి యీ పని పూర్తిఅయినది. ఇక నీ శవముల నెక్కడనైన పారవేయించేవలెను. (పిల్లలు దగ్గుదురు) వీరు తిరిగి బ్రతుకుదురాయేమి? దైవమా! నా యత్నము విపరీకృతమైన ట్లున్నదే విషముకూడ వీరియందు నిర్విషమైనదా? (ఇరువురు లేతురు)

మా:—అమ్మాయీ! ఎంతనిద్రపోతిరా బడుగుల్లాగున్నారు లేచి దేవుని దర్శించిరండు, త్వరగ భోజనముచేయవచ్చును.

ఇ:—ఏమిరా దైవమా! ఈ దుర్మార్గురాలియత్నము మమ్మం దులకుబంపి యేమిచేయదలచినవో కదా? అన్నింటికీ నా యాపద్బాంధుండే కలడు.

బా:—పిన్ని! మే మిపుడు వెళ్ళలేము.

మా:—ఏమే నా మాట కడ్డముచెప్పెదరా? జాగ్రత్త.

సూ :—చెల్లీ! మనకిక్కడ వితండవాదమెందుకు? వెళ్ళివత్త మురమ్మ. హా జనకా! (ఇరువురు నిష్క్రమింతురు)

న-భో :—(ప్రవేశించి) మాణిక్యమా! పిల్లలెక్కడ?

మా :—పిల్లలుగోడ వేకాని నా మాట, నా మంచిచెడ్డ మీకు అక్కర లేదుకదా?

న-భో :— నిన్ను చూచుచునేయుంటినికదా? పిల్లలమాట చెప్పవేమి?

మా : —పిల్లలు —పిల్లలు —ఆ దుండగపు పిల్లలు—ఆ మొండి బుద్ధులపిల్లలు—ఆ అల్లరి పిల్లలు— ప్రాణాలు నిలువునా కొరుకుతినే పిల్లలు—ఎంతో మంచివారకొని జాగ్రత్తగా పెంచుచుంటే, ఆ పెద్దమ్మ లక్ష్మమ్మగారికి ఏంపుట్టిందో ఇంట్లో కుండలన్నీ బ్రద్దలుకొట్టి నా శరీర మంతా రక్కి రవ్వచేసి —పిల్లలను ఎత్తుకొనిపోయినది. చాలురాబాబూ పిల్లలనుపెంచు. సరదా తీరిపోయినది (అని నిష్క్రమించును)

న-భో :—అయ్యో! ఈ పిశాచే మెక్కడ దాపురించెను? వారి నేమిచేసినదో? దీనిమాటలతీరుజూడ వేరొకలాగు తోచుచున్నది హా! నవభోజా! నీవెంత దుష్టచిత్తుడవు? ఆ సతీమణి యుసురులు బాయువేళ నీ వొనర్చిన ప్రతిజ్ఞలన్నింటిని నీటగలిపితివికదా? సంతాన మున్నవారికి మారుపెండ్లి యెందులకు. ఉన్నదానితో బిడ్డలపోషించు కొనరాదా? అటు భార్యను చూడకున్న అది కొరకొరలాడును. ఇటు పిల్లలు యేడ్చుచుందురు. పరాత్పరా! సంతానమున్నవానికి రెండవ పెండ్లి రోత—రోత.

ఆ॥ వె॥ మారుపెండ్లికన్న ♦ మనుజుండు పెనుబండ
దాల్చి నూపబడుట ♦ ధరణిమేలు
ఎంతవారికైన ♦ నిట్టికష్టమువద్దు
ఇత్తగింపుదయ్య ♦ చేయునీనతి.

సీ. తనకు నాధారమౌ ♦ తరుశాఖ మొదలంట
గొట్టంగ నెంచెడు ♦ కుమతికైన
జలరాశిదరి జేర ♦ గలనంచు దలఁపున
చేసీత నీరెడు ♦ చెనటికైన
ఆవుపాలనుద్రావు ♦ నాసచే బొదుగును
గోయంగ నెంచెడు ♦ కుమతికైన
కంద బెల్లమురీతి ♦ డెందంబునను నెంచి
భక్షింపజూచెడు ♦ పందకైన

ఆ॥ వె॥ బిడ్డలున్నయపుడు ♦ పెంజ్లాడగారాదు
పిన్నవారికైన ♦ పెద్దకైన
భోజ్యనను భవంబు ♦ పుడమిలో జనములు
తథ్యమనుచు మనుల ♦ దలపుడయ్య.

(నిష్క్రమించును.— తెర వ్రాలును)

రెండవ రంగము—అడవి.

(పెద్దవయస్సున బాలనాగమ్మ సూర్యనాగమ్మలు ప్రవేశింతురు.)

బా :—అక్కా! మన కష్టముల కంతు లేకున్న దే మనల నల్లా రుముద్దుగ బెంచుతండ్రి—ఒక్కనిముషమైన గన్పడుకున్న నెంతయో బెంగ జెందు తండ్రి—మనల నిట్లడవిపాలు జేయునా? మేనమామల పాను గంటిపట్నమును జేరమైతిమి. పుట్టినింటను జేరమైతిమి. మన బతుకు త్రిశంకుస్వర్గమువలె నున్నది.

సూ :—చెల్లెలా! పూర్వభవంబునం దొనర్చినకర్మ మూరక పోవునా? “అనస్యమనుభోక్తవ్య” మను నుడి మరవవచ్చునా! మన కదృష్టము లేకుంటచే నీ కాననవాసంబు సంభవించినది.

బా :—భగవంతుని లీలావిలాసంబు మనయందుగలదు కావు ననే యీ పన్నెండేండ్లు సుఖంబుగ జీవించుచుంటిమి. "అడవిరక్షితేఁ యుబలుండు వర్ధిల్లు" అను వాక్యము మనయందు సార్థకమైనది.

నూ :—చెల్లెలా ! మనకీ కాననంబు క్రీడోద్యానమురీతి విలాస కారణంబుసుమీ

బా :— నిజమక్క. రాజగృహంబురీతి సకలసౌఖ్యభోజనంబు వనంబు ఏమన, పండుకొనుటకు హంసతూలికాశయ్యలకుమారుగ మృదుకిసలయ సెజ్జలును—రాజభోగాన్నంబునకు బదులుగ వంశపంకులా న్నంబును — మధురపానీయంబులకుద్విగజుంటి తేనియలును—పరిచారికా శపంబులకు నీడుగహరిణిశత సహవాసంబును — వినోదగానపరంపరలకు సమముగ—మంజులభృంగశుకపికాలాపంబులును — మన కుపకరింపుచు న్నది, కార్యవిదులరీతిగ కులము సహకారమగుచున్నది. ప్రకృతిసౌం దర్య మీక్షించితిమా అన్నాహారంబుల అవసరంబేయుండదుగదా ! నదీసైకతస్థలుల నాడుచు, జలంబుల నీదుచు, తరుచ్ఛాయల విశ్రమిం చుచు, పొదలదూరుచు, పనసరసాల ఖర్జూర రంభానారంగ ఫలంబుల భక్షించుచు, పుష్పసముదాంబుల తురుములదాల్చుచు విహరించు జన్మమే జన్మము.

నూ :—సోదరీ ! నీ వనునది సత్యము. ఆ పొదరింట క్రిమంగు వాయ విశ్రమింతము (అని పరిక్రమించి పొదక్రింద కూర్చుందురు)

కార్యవర్ధిరాజు :—(ప్రవేశించి) వేటలాడు తమకంబున సోద రులబాసి యింతదూరము వచ్చితిని. దాహము మిగులబాధింపుచున్నది. ఈ చేరువను జలంబులున్నజాడయే కన్పింపదు. (అని నలుమూలలు చూచి) ఆ పొదరింటక్రింద నిరువురు మందయానలున్నారు. అహా ! వీర లప్సరసలా, దేవవామరంధ్రులా ! లక్ష్మీసరస్వతులా ? కాక నాడు దానవుల భ్రమింపజేయ శ్రీమహావిష్ణువు ధరించిన మోహినీరూపులా

వీ రెవ్వరో తెలిసికొ౦దునుగాక (అని పరిక్రమించుచు) ఓ లతాతన్వు లారా? మీ రెవరు? ఈ పొదరింట నెందులకున్నారు. నేను పానుగంటి పురాధీశుఁడగు రామవద్దిరాజు నాత్మజుండను కార్యవద్దిరాజనువాఁడ. ఆఖేటాభిలాష సోదరులవిడిచి యిటువచ్చితిసి. మీ యుదంతం బెరిం గింపుడు.

సూ :— ఆర్యా! అనదలమై వృక్షచ్ఛాయలె గృహంబులుగ— వన్యఫలంబులె యాహారంబుగ—కర్ణకఠోరదుష్టసత్వారావంబె జోలపా టలుగ—గిరిఝరీనీరంబులె మధురపానీయంబులుగ—దుఃఖమే తల్లిగ— కష్టపరంపరలే తండ్రిగ—జీవించు మా యుదంతంబుతో మీకేమిపని? సీవారిని మీగు పొందు. మా దీనచారిత్రమువిని మీ మనక్లేశ పరచుకొనకుడు.

కా :—ఏమి మాఁగ్లాడుచుంటిరి. మీ నామధేయమేమి? ఎవని పుత్రికలు.

సూ :—నా ముద్దుచెల్లెలు బాలనాగమ్మ, నేను సూర్యనాగమ్మ యనుదానను. మే మేఁడుగు రప్పచెల్లెండ్రము.

కా : — (తనలో) ఏమి చెపుమా? కుడిచేయియు, కుడికన్ను నదరుచున్నవి ఇచ్చట నేమి లాభముగలుగును. వీరింగాంచిన నవీనబం ధుసమాగమంబువోలె డెందంబున సానందవీచికలుల్లసిల్లుచున్న దే. కానిమ్ము వీరి చారిత్రము వినితీరవలెను. (ప్రకాశముగా) అబలలారా! మీ రెవని పుత్రికలు. నాకడ దాపురము సేయకుడు. నా శక్తికొలది మీ కుపకారమొనర్చెద.

సూ :—రాజశేఖరా! మేము భూచక్రపట్నమేలు నవభోజుని పుత్రికలము. మా తల్లి భూలక్ష్మీదేవి మా తల్లి చిన్నతనముననే మర ణించుటచే మా తండ్రి మాణిక్యాలుదేవిని ద్వితీయవివాహమాడిరి, మేమును సవతితల్లిచే పలుబాధ లుపడి తుదకీ ఘోరవిపినంబుజేరి యిచ్చటనేయుంటిమి.

6

కా :—(ఆశ్చర్యముతో) మీరు మా మేనత్తయగు లక్ష్మీదేవి పుత్రికలా! నవభోజుడు మాకు మేనమామయగును. అహా! ఆఘటన ఘటనాసమర్థుండగు నా జగద్రక్షకుని లీలావిలాసముల వాఙ్మానస గోచరములుకదా! ఎక్కడ పానుగంటిపట్నము ఎక్కడ ఘోరా టవీప్రదేశము. వేటకై వచ్చుటయు నిట నాప్తబంధుదర్శనలాభంబును చేకూరినది.

సూ :—(చకితయై) ఏమి చెపుమా! ఈతడు మా మేనమామ కుమారుడా? బాగు బాగు. వీ లేకుగురన్నదమ్ములా?

బా :—(తనలో) ఈ మోహనాంగునకు మారజయంతాదులు సాటిగారన్న నలకూబరుడుమాత్రము సరియగునా? సౌందర్యమున్న నిట్లుండవలదా? అద్దిరావిలాసము—బళిరా హావములు—ఆ మాటలలోని తియ్యదనం బెంతనివర్ణింపవచ్చును? అహా! సొగసుకాండ్రకు తలమా నికమననొప్పు నీతని చెట్టబట్టిబట్టిన యెలనాగ దేకర జన్మసాఫల్యము. నా మనంబేలకో నీ పురుషోత్తమునిపై లగ్నమగుచున్నది. నీతనిజూచిన నే సుందరాంగి వరింపదలంపదు? (ప్ర) ఆర్యా! మాకనుంగుచుట్టము లైనమీరలీ పల్లవాసనంబున నాసీనులుగండు. (అని యొకకొమ్మ పరచుచున్నది.)

కా :—ఓహో! మరదలా! నీ నపర్యకు నా స్వాంతంబున సంతసంబయ్యె. (అని గూర్చుండి) ఓ సౌందర్యనిధులారా! మేము ఒకే గర్భమున జన్మించిన కన్యలనె వివాహమాడు దలంపుతో దేశదేశం బులు తిరుగుచుంటిమి, దైవవశంబున నేటికి మీరు తారసిల్లితిరి. (బాల నాగమ్మ నుద్దేశించి)

సీ. అందమై సొగసులై ♦ యతికోమలంబయి
కళలచే విలసిల్లు ♦ కలికిమోము
చేరలకెక్కుపై ♦ శ్రీలను గురియించు
వాలుజూపులుగదా ♦ వనితకనులు
తెల్లనై నిగనిగకీ ♦ పెల్లుగ గన్పించు
చక్కని పలువీరు ♦ సక్కవముగ

నుగ్గునుగ్గులు దేలి ♦ నొసటికి శోభను
కలిగించు ముంగురుల్ ♦ కలికికహాహా!

గీ. మేనిబంగారువన్నెలీ ♦ మెలత దేహ
కాంతికీడౌనె సుకుమార ♦ మెంతగలదు
చక్కదనములకుప్ప యీ ♦ జలజనేత్రి
తెలిసి వర్ణింపదరమౌనె ♦ భళిర భళిర.

ఈసుందరయువతితో బొందొనరింప డెందం బువ్విళులూరుచున్నది (ఇద్దరినిజూచి) సుదతీమణులారా! మీరీ యడవిని దుమ దిపత్తుఁబడ...జాలరు. నా వెంట పానుగంటపట్నమునకు రండు అచ్చట మీ మేనమామ రామవర్ధిరాజు మిమ్ముల కన్నులలో బెట్టుకొని సంరక్షించును

సూ:—ఆర్యా! మేము నీ వెనువెంట రాజాలము. ఎన్నటికైన మా కడగండ్లు గట్టెక్కు సమయము తటస్థించినపుడు చూచెదముగాక.

బా:— (సూర్యనాగమ్మతో) అక్కా! మన మీతనితో పానుగంటిపట్నమునకుబోయిన తప్పేమికలదు?

సూ:—మన మేనమామవచ్చి తీసికొనివెళ్ళునరకు వెళ్ళరాదు. (తనలో) దీని కీతనియందు మక్కువగలిగినట్లు తోచుచున్నది. వీరి చూపుయందనన్యోన్యప్రణయము సూచించుచున్నది.

బా:—నే నింతవర కాలోచింపలేదు

కా:—సుదతులారా! నేనువచ్చి తడవైనది. మా జనకుని మీ కడ కంపెద. వారితో తప్పక రండు. (అని నిష్క్రమించును)

బా:—(నిదానించి చూచి చూచి) సర్వము దైవాధీనము. నిత్యకల్యాణుండగు పరమేశ్వరుఁడే సుఖదుఃఖములకు కర్త.

సూ:—చెల్లెలా! మనకై సోదరీమణులు ఎదురుచూచుచుందురు. నివాసంబు చేరుదముర మ్మా.

(ఇరువురు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము—సంపూర్ణము.



# బాలనాగమ్మ

## తృతీయాంకము

మొదటి రంగము—పానుగంటిపట్నము కార్యవర్ధిరాజు
సౌధమునంగలి యుద్యానవనము

కార్య:—(ప్రవేశించి) దైవవిలసితములు దురూహ్యములు. అడవియుసిరికాయయు, సముద్రపుటుప్పునుగలసి యూరుగాయయైనట్లు విధి ఎచ్చటనుండి యెచ్చటికో సంబంధము గల్పించుచుండును. మాకును భూచక్రపట్నమువారికిని మాటపై మాటవచ్చి రాకపోక లుడిగినపిదప నే నద్వితీయంబుగ వారి కుమార్తెను ద్వితీయగ జేసికొంటిని. ఆ సౌందర్యనిధి—అందముల పాలవెల్లి— చక్కదనాలకుప్ప — భూలోకసుందరి— ఇంచువిల్కాని కరకుటమ్ము — మన్మనోహారిణి— ఇంకను విహారంబునకు రాకున్నదేమి?

చ॥ అంటినగందుమేను ప్రియ ♦ మారగ బల్కెడు ముద్దుపల్కులున్
గొంటెతనం బెరుంగని మ ♦ నోహరవర్తన సద్వివేకమున్
బంటవలంతి కీడయిన ♦ భామినికోరిమి యెల్లవేళలం
బంటుగ నేలదే మరుని ♦ భాగ్యవిలోకననేత్ర సౌజ్ఞలన్.

ఆ మోహనమూర్తి దగ్గరనున్నంతసేపు దినమొక త్రుటివలె నగును. అయ్యో! ఇంకను రాకున్నదేమి?

గీ॥ మెఱుపులోపలి తళుకును ♦ మేల్మినర్ణ
దీప్తిపుష్పపరాగంబు ♦ దెచ్చి వనజ
భవుడు వనితగా జేసె పో ♦ వసుధయందు
కాకయుండిన నిటువంటి ♦ కళలుకలవె ?

(ప్రవేశము—బాలనాగమ్మ)

కా :—(చూచి) ఓహో ! వచ్చితివా ప్రియా ! నీవు నా చెంగట లేకుండుటచే నీ సమయము బ్రహ్మకల్పంబుగదోచినదిసుమీ.

బా :— ఏమి నా భాగ్యము ? పూర్వభవంబునం దెట్టితపంబానరించితినో ? లేకున్న మీ వంటి యుదాత్తచిత్తుడు నా యట్టి అనాధయువతికి వల్లభుడగునా ?

కా :—(దగ్గర జేరి) సుందరీ ! భృంగసమాకీర్ణ౦బగు నంబుజంబుబాపి ముంగురులచే నావృతమై నీ ముఖం బెట్లుప్రకాశించుచున్నదోగదా! (అని చెక్కిలి చేతి నిమురుచున్నాడు)

బా :—(భర్త భుజము పై చేయివైచి) వివిధసుమంబుల మరందంబు చవిజూచు నా షట్పదంబుమాట చెప్పకుడు.

కా :—బోటీ ! ఏమంటివి ?

బా : — ఆ షట్పదంబుమాట దలపెట్టకు డంటిని.

కా: —ఎంతయాస్వాదించిన దుమ్మెదకు వనరుహభ్రాంతి తనివితీరనట్లే నీ వాక్సుధారసధారల నెంతగ్రోలిన తనివిదీరకున్నది.

బా :—(చిరునవ్వుతో) కార్యాసక్తులమాట లెప్పుడు నిట్లే యుండునుగదా ?

కా :—(ముఖము చిట్లించి) కార్యాసక్తులా !

బా :—కార్యాసక్తు లెప్పుడు తమపనియున్నంతవరకే మన్నింతురుగాని తర్వాత—

(ప్రవేశము వృద్ధకంచుకి)

కం:—జయము జయము కుమారమహారాజుగారికి.

కా:—ఏమిరా! యిటువచ్చితివి?

కం:—ప్రభూ! గంటికోటదారికిని మనకును సరిహద్దువద్ద వచ్చిన తగాయిదా సమరసముగ పరిష్కారము కాలేదు.

కా:—కాకున్న.

కం:—వారికిని మనకును సంగరంబు ప్రసంగినది. కావున మంత్రాలోచన మొనరింప మహారాజుగారు మిమ్ముల దీసికొనిరమ్మనిరి

కా:—సరే వచ్చెద పొమ్ము.

కం:—చిత్తము దేవరా. (నిష్క్రమించును.)

కా:—బాలా! నీ వాకు మాటయే యదార్థమైనది. ఉత్తమ సతుల వచనంబు లెప్పుడు సత్యదూరంబులుగావు.

బా:—ఎంత భాగ్యహీనురాలను మిమ్మెడబాసి నొకక్షణం బేనియు నిలువజాలను. నన్ను మీ వెంట గొనిపొండు.

కా:—ప్రియా! నాకు మాత్రము నిన్ను విడచియుండుటకు మనంబొప్పునా? కార్యావసరంబునుబట్టి యెడబాయకతీరదు. ఏమి చేయునచ్చును? విరోధి తండంబుల దునుమాడి వారి రాజ్యంబు మన యధీనం బొనర్చుకొని పరిపాలించుట రాజధర్మంబుకదా? "సంతుష్టా ఋతే పార్థివాః" అన్న పలుకు నెరుంగవా? వారి నిధివలె వాహినీ గంభీరంబును—కాననంబువలె మదగజవిహారంబును— వర్షఋతువుభాతి నిరంతర శరధారాపాతంబును — శోణనదీతీరంబుభాతి అన్యోన్య వీరభట ఖడ్గప్రహారస్రవితరుధిరవాహినీ పంకిలపంకంబునుగలిగి రణభూమిచూడ్కులకు వేగిరమ్యొడు, కాన నా పలుకు లాలించి యిచ్చటనేయుండుము.

బా:— నాయకా! మన వియోగంబు చిరవియోగంబు కాకుండునుగాక.

కా :— తథాస్తు. బోటీ! అంతర్వత్నివగు నీ గర్భంబున సుమా సంబోలు గుమారుం డుద్భవించి మన కపారసౌఖ్యంబు లొసంగు. (ఏమగిరులు గీసి) తరుణీ! నీ వీ గీటులదాటి యెంతకార్యమొ చ్చినను రాకుము. ఇది మున్మూటికి నా యాజ్ఞ.

బా : తమ యానతిమెయిం వర్తించెద. తల్లి మరణించుటయు తండ్రి ద్వితీయవివాహమాడి యామె నలపుమందులు తలకెక్కి యుక్తా యుక్తజ్ఞానశూన్యుండై కారడవిలోనుంచి పోవుటయు, పాదుషావల్ల రాజ్యపదభ్రష్టుడై మన్నాథుని విజ్ఞాపనమూలంబున పునఃప్రాప్తియు, పిమ్మట జనకుని మరణంబును, మదీయగర్భధారణంబును, మన్నాథుని తోడి యెడబాటును తలంచుకొనిన స్వప్నవృత్తాంతంబువోలె నున్నది. నిజముగ నేను బాలనాగమ్మనుకానా? సర్వము విధివిలసితమే.

(ఇరువురు నిష్క్రమింతురు.)

రెండవ రంగము—నాగళ్ళపూడి గట్టుమీద

మాయల మరాఠీ గృహము.

మ :—(హుక్కాపీల్చుచు ప్రవేశము) వహ్వారే బలేతమాషా దేఖో! బడాహుషార్. బలే పసందుహువా? ఈ ప్రపంచములోని అందగత్తెల నెందరినో చెర దెచ్చితిని? వారందరిలో గాండ్లసంగోజీ వంటి సుందరాంగియు నచ్చికస్తురాలును నా కెక్కడ దొరక లేదు. మైం ఉస్‌కో బులావాహుం సంగూ! సంగూ! ఇదరావో!

(సంగు — ప్రవేశము)

సం :—ఎందుకు మరాఠీ!

మ :—ఎక్కడకు మీాసు దయచేసినారు?

సం :—నే నెక్కడకు వెళ్ళలేదు.

మ :—అంతే ఇక్కడ కూర్చున్నారన్నమాట. నా మంత్రి శక్తికిని వైభమునకును ఎందరు వశులైనారో తెలియునా ? నామాయలముందర ఎదురి మంత్రములు తంత్రములు పిల్లినిచూచిన ఎలుకవలె పటాపంచలగును. నల్లభూతాలు, ఎర్రభూతాలు, ముక్కిడిభూతాలు నాకు వశులై నా యాజ్ఞకెదురు చూచుచుండును. నా పేరుచెప్పినచో ప్రతివాని హృదయము కంపింపకమానదు.

సం:—నీగర్వంమంటిపోను. పతివ్రతలజోలికి పోరాదని ఎన్నిసార్లుచెప్పినా వినవు. నీ కర్మమెవరు తప్పింపగలరు ?

మ:—అరే సంగూ ! ఎందరెందరు రాజపుత్రికలు మా పాదుషాలకు భార్యలై వారి కరుణకు పాత్రులారాండ్రు కాలేదు. బలిమిని చెర దెచ్చుట మా మతమునకు ధర్మమే.

సం:—కన్యకలదెచ్చిన దేవచ్చును కాని సతీతల్లులజోలికి పోవవచ్చునా ? ఒక్కొక్క పతివ్రత ప్రపంచమునకు నెంతెంత పనులుచేసి చూపినది—ఒకతె సూర్యగతిని మాన్పినది—ఒకతె త్రిమూర్తుల బిడ్డలుగ జేసినది—ఒకతె యముని వశంగతుడైన భర్త ప్రాణంబుల నిలిపినది—ఒకతె యగ్నిలోబడి తన సతీత్వము లోకంబున కెరుకపరచినది – ఇంకను నిట్టి సతీమణుల కాలవాలంబైన యార్యావర్తదేశం బెంతయు ధన్యమైనది. ఆమె బిడ్డలమగు మనకీ దురహంకారముకూడదు.

మ :—అరే ఈ ప్రపంచములోని అందకత్తెల వెదకి వెదకీ చెర దెచ్చి నాతో భోగింపని జన్మ మొక జన్మమా ? అందగత్తె లెక్కడ చూచెదను, (అని ప్రశ్నచూచి నిదానించి నవ్వుచు) బలె ! బలె ! వహ్వారే ! సెబాస్ బలేవిచిత్రం, బడా బడాసంతోషం.

సం :—ఎందులకానవ్వు ?

మ :—నీ పొగరణుగుతుంది. నీ నెత్తిమీది దేవతను, అంద చందముల చందమామను తెస్తా. అప్పుడు నీ గర్వమంతా— (చిటిక వేయుచు) క్షణంలో కృంగిపోతుంది.

సం :—నా గర్వము ఏమి అపకారమొనర్చినది ? ఆ అందగత్తె సుందరాంగి యెవరు ?

మ :—పానుగంటిపట్నములో కార్యవద్దిరాజుభార్య బాలనాగమ్మ అనే సౌందర్యవతిగలదు. దాని చెర తెచ్చెదను.

సం :—నీ యత్నం కూలిపోను. అక్కడకు వెళ్ళెదవా ఆ రాజు చేతులలో నీకు మరణము తప్పదు.

సీ. అల సీత చెఱదెచ్చి ♦ నాజిలో రావణుం
డేమయ్యె నెరుగవే ♦ హీనమతివి
దమయంతి బొందంగ ♦ దలచి నిషాదుండు
మరణంబుజెందడే ♦ ధరణిలోన
ద్రౌపదసభలోన ♦ రట్టుజేసి (దురాత) నదుష్ట
రారాజు గూలడే ♦ రణములోన
శచిబొంద నహుషుండు ♦ స్వాంతంబులోనెంచి
పదభ్రష్టుండై పోడె ♦ ముదముపీడె

గీ. ఉత్తమస్త్రీల చెఱబట్టి ♦ నూహలెల్ల
కాలపాశంబు గళమున ♦ గట్టునట్లు
వలదు రాజకాంతలపయి ♦ వలపువలదు
మాయలటసాగిరావు సు ♦ మా మరాళి.

మ : — అరే సంగూ !

గీ. భూతజాలంబు నా చెప్పు ♦ చేతలందు
నిలచి వర్తించు నన్నెట్లు ♦ దలచినావొ

అఖిలజనభీతిదాయకం • బౌ మదీయ
మాయకాగురు దప్పించు • మనుజుడేడి ?

పూర్వపువారిమాట లెక్కచేస చెప్పకుము. (హులుకాప్పట్టి తల యూచుచు) ఆ నెలంత నెట్లా తేవడమని ఆలోచిస్తా! ఏ వేషమున పోయిన. కార్యసాధనమగును ? చెప్పుము

సం :—ఆ యూహలన్నియు నీకే తెలియును, కర్మమునాటు శక్తివంతుడు లేడు. మృత్యుదేవత నెత్తిపై తాండవించుచుండ వారింప నెవ్వరికి వశముకాదు. అరుంధతిని, ధృవుని, విష్ణుపదంబును మరణమా సన్నమైనవారలు గానరట. హితులమాటలు వినరట. నీ కర్మము.

(అని నిష్క్రమించును.)

మ :— (సగర్వము) ఈ మాయలమరాఠీ వలచినంతయు జేయ జాలఁడా ? చూచెదనుగాక.

(నిష్క్రమించును)

మూడవ రంగము—పానుగంటిపట్నము కోటదర్వాజా

తలారిరాముడు—కాపలాకాయుచు ప్రవేశించును.

త :—సేవకావృత్తి బహుకష్టమైనది. ఏమన ? సతతము వారి ననుసరించి తిరుగుచున్నను "అది చేయలే దిది చేయలే" దని యేదియో నెపము పన్నుచునేయుందురు. ఎంతశరీరము వంచిపనిచేసినను మెప్పు రాదు. కాని—ఇట్లేవచ్చి ఏవో రెండుముచ్చట్లు చెప్పినంతనే వారిచి మిక్కిలి గౌరవింతురు. ప్రభువుల దయకలదని విర్రవీగుట యేరికికూడదు ఉర్వీశుల కరుణనమ్మి యుబ్బకు మన్నాడు వేమన్న మా ప్రభువువారు గండికోటపై దాడివెడలుచు పోతుంటీగనైన లోనికి రానీయవలదని నా కాజ్ఞాపించిరి. గాన నప్రమత్తుడనై నా పనియందుండవలయును. (అటు నిటు చూచి) ఏమి చెపుమా ? నొసట విభూతిరేఖలదీర్చి శిరమున కిరీ

టము ధరియించి మెడను రుద్రాక్షసూలలు వ్రేలాడ నొకవంక శంఖ
ము నొకవంక నందిపిసిగల గంటను చేత పొడవైన వేణుదండమును
దాల్చి అపరశివుడోయనునట్లు జంగమదేవర యిటువచ్చుచున్నాడు.
వీరికి ప్రభువువారి యానతిప్రకారము బత్తెమిచ్చి పంపెదను.

(పై వేషముతో శంఖముపట్టుచు మరాఠీ ప్రవేశించును.)

మ :—సాంభమూర్తివారి కరుణాకటాక్షంగలిగి, వీరభద్ర
మహేశ్వరుల దయగలిగి, శ్రీశైలమల్లేశ్వరుని అనుగ్రహంగలిగి శుభసం
పదలుగలిగి వర్ధిల్లాలి.

రా :—అయ్యా! జంగమదేవరా! ఇదిగో భత్యము శేరు
బియ్యము, డబ్బు తీసికొనుము.

మ :—ఏమిరా! రాముడూ! లోపలకువెళ్ళి రెండు మూడిళ్ళు
ముష్టి యెత్తుకొనవలె. మహేశ్వర్లకు పూజచేసి అర్పించవలె, నిన్నటి
నుండి యుపవాసం శ్రీశంభులింగనికి నన్ను లోనికి పోనిమ్ము.

రా :—ప్రభువువారు నగరంబున లేరు. గండికోటపై దాడివెడ
లినారు. ఎవ్వరిని లోనికి బోనీయవలదని రాజాజ్ఞ కావున నీవు లోప
లకు వెళ్ళుటకు సెలవు లేదు.

మ :—ఓరీ! ఒకటి రెండు యిళ్లు ముష్టియెత్తుకొనువాండ్లకు
రాజాజ్ఞయేమిటి? నన్ను లోనికి పోనిమ్ము.

రా :—నిన్ను దయదలచి పోనిస్తినా? నా తల యూడిపోవును.

మ :—నీవు పిల్లలుగలవాడవుకావా? నా వంటి బిచ్చగాండ్ల
నడ్డుచున్నావు ఆ బాలనాగమ్మకు సంతతిచ్చిన దేవరను నేనుకానా?
ఇప్పుడు యేడవరోజు బాలెంత తెలిసినదా నా మాహాత్మ్యం.

రా :—(ఆశ్చర్యముతో తనలో) అయ్యో! వీఁడసాధ్యునివలె
నున్నాఁడు. నాకు పిల్లలు లేరనుచున్నాఁడు. కోటలోని కబురు వీని కెట్లు

తెలిసినది. సాక్షాత్తు పానుగంటి పట్నమేలు ఆ శంకరుడే ఈ రూపం బూన వేంచేసియుండెగాబోలు (ప్రకాశముగా) దేవరా నాకు పిల్లలు లేని మాట సత్యమే. నీవు ఆ సాంబమూర్తివే. ఐన రాజాజ్ఞ మీారజాలను. నన్ను మన్నింపుము నీ కిదే నమస్కారము.

మ :- ఓరే నీకు బిడ్డల నిస్తాను. చూడరా నా ప్రభావం.

రా :—ఏరీ పిల్లలు సంతతి లేదన్న విచారం సమసిపోతుంది.

మ :—ఇటురా ?

రా :—నా నౌఖరీయం దన్యథావర్తించరాదు.

మ :—భయములేదు రమ్మురా.

రా : (దగ్గరకు వచ్చును)

మ :—(జోలిలోని విభూతితీసి నొసట బొట్టువుంచి కొంచెము విభూతియిచ్చి) నీ భార్యలకు బొట్టుపెట్టి కొంచెము నోట్లో వెయ్యి, కొంచెము యింటిమీాద, వాకట్లో, దొడ్లో, పాతరమీాద, నూతులలో జల్లుము పొమ్మురా.

రా :—ఈ లోపున పహరా ఎవరు కాయుదురు ?

మ :—నేను కాసెదను లే.

రా :—(నిష్క్రమించును)

(నేపథ్యమున)

బాబూ బువ్వపెట్టరా ! బాబూ బువ్వపెట్టరా ! ఏం తెచ్చావురా బాబూ అన్నంబాబూ ! చొక్కాలుబాబూ ! పప్పులు బాబూ ! బాబూ ఆకలి.

రా :—(రొజుకు పరుగెత్తుకొనివచ్చి ఆశ్చర్యముతో) ఏం పిల్లలోయిబాబూ ! పుడుతూనే అన్నం అన్నం అని వేపుకొనితింటారు. ఇంట్లో పిల్లలు—వంట్లో పిల్లలు—దొడ్లో పిల్లలు—నూతిలో పిల్లలు—పాతరలో పిల్లలు—సందులో పిల్లలు—గొందుల్లో పిల్లలు—ఒడిలో పిల్లలు—పక్కలో పిల్లలు ఇది యేమిమాయరాబాబూ ! పిల్లల సముద్రం యీాద

లేకున్నాను. ఎక్కడకువెళ్ళినా అన్నం పెట్టమనే పిల్లలే. అయ్యో! భగవంతుడా! ఇదెక్కడి పిల్లల భూతమోయి మతి పోవుచున్నది. ఏమిచేయుటకు దోచకున్నది. నా భార్యలు యీ పిల్లలతో పడలేక హడలిపోవుచున్నారు. ఈ జంగందేవర ప్రభావం—అచింత్యము—అనంతము—అనుపమానము—అఖండము — అనిర్వాచ్యమున్ అత్యద్భుతము— పొట్టపోసికొనుటకై వచ్చు జంగములవంటివాడుకాడీ జంగమదేవర. బాబూ సంతతిసరదా ఒక రోజుతోనే తీరిపోయింది. సంవత్సరముపొడుగునా బ్రతకగల యింటిలోని ఆహారపదార్థమంతయు ఒక దినమునకైన చాలలేదు. వీరి నెట్లు పోషింతును? ఎందుకొత్తును. ఇంటికిపోయిన అన్నము అన్నము అని వేపుకొనితిందురు. హా దైవమా! సంతితిగల వారిన్నిపాట్లు పడుచుందురుగాబోలు.

ఉ. బాలలు లేమిచింత పగ ♦ బాలలుగల్గిన బెంప చింతరో
గాలను బాపనంత కల ♦ కాలను సత్కృతులొట చింతను
శ్రీలన్నోసంగ చింతబహు ♦ చింతగదా మనుజాలి కెప్పుడుం
బోలగ జూచినన్ సుతులు ♦ పుట్టనివారికి జింతయెక్కడే.

అయ్యయ్యో! నా తండ్రీ! శంకరా! శంభో! ఈ ఆపత్సముద్రము నుండి కాపాడవా? (అని మరాళీదగ్గరకుచేరి) జంగమేశ్వరా! నమస్కారము. బిడ్డలపైగలతీపియంతయు తీరిపోయినది. స్వామీ! ఈ సంతతి నేను భరింపలేను. నన్ను రక్షింపుము. నీ శరణుజొచ్చితిని. దేవరా! నీ మాటకు అడుగుదాటను.

మ :—(నవ్వుచు) నీకు సంతానము అక్కరలేదా?

రా :—(సంకోచముతో ఊరకుండును)

మ :—చెప్పు.

రా :—సంతతి కావలెను. ఇందరిని భరింపలేను.

మ :—అట్లయిన ఈ విభూతి నీ భార్యలపై జల్లుము. ఇదివర కెక్కడెక్కడ జల్లితివో నచ్చటచ్చట జల్లుము. నీ భార్యలు ఏడుగు రకు నేడుగురుపుత్రులుమాత్రి ముందురు. (అని వీభూతి నిచ్చును)

రా :—(నిష్క్రమించి తిరిగి ప్రవేశించి) అమ్మయ్యా! ఇప్పటికి బ్రదికి బైటపడితిని. సుందరాంగులైన కొమరు లేడుగురు జాలు. తక్కిన వారందరు సుడిగాలికెగసిపోవు చెత్తతునకలవలె ఇట్లే అంతరించిరి. (సుభాశని సమీపించి) జంగమేశ్వరా! నీవు నా పాలిట పరమేశ్వరు డవు. నీకు నగరులోనికి బ్రవేశమున కనుమతిచ్చెదను, గాని వెంటనే రమ్ము. ఈ సంగతి వెల్లడయిన నా ప్రాణములకు మోసము రాగలదు.

సు :— రెండిళ్ళు ముష్టియెత్తుకొని వచ్చెదను. నీ కేమియు భయములేదు. (అని లోనికిపోవును) తెర వ్రాలును.

తృతీయాంకము—సంపూర్ణము.



# బాలనాగమ్మ

## చతుర్థాంకము

మొదట రంగము — బాలనాగమ్మ అంతఃపుర సమీపము.

(జంగము వేషముతో మరాఠీ ప్రవేశించును.)

మ :—గురుకటాచ్చం! గురుకటాచ్చం! సాంబమూర్తివారి కరుణాకటాచ్చం వీరభద్రులవారి కరుణ (శంఖం పట్టును)

(నే పధ్యమున)

జంగమ దేవరా! బాలనాగమ్మ ఏడురోజులు బాలెంత. భిక్షము పెట్టెదను పొమ్ము.

మ :—అలాకాదు, బాలనాగమ్మ పెట్టిన భిక్షతో పరమేశ్వరారాధన చేయవలె. ఇతర్ల బిచ్చం పట్టను. లింగనికి ఉపవాసం పాపం కూడను. మహేశ్వరుని కోపంనస్తుంది. జాగ్రిత్త.

(నే పధ్యమున)

జంగమా! ఇంతపంత మేల? శివుని పూజచేయుట ముఖ్యముకాని బాలనాగమ్మ భిక్షయే కావలెననుట మూర్ఖము.

మ :—ఆఁ ఎంతమాట రాజాలదా? నేను యిచ్చినపిల్లవాడు కాడా? ఆమె కింతపొగరా? నే నిచ్చిన బాలుని తీసికొనిపోయెదను తే.

(నే పధ్యమున) ఏమనుచున్నావు? పిల్లవానినే తీసికొనిపోయెదవా? అయ్యో! ఎంతకష్టము వచ్చినది. సూర్యవంశాలంకారుడగు బాలు డేమియపరాధ మొనర్చెను? నీకు చేటెడు ముత్యము లిచ్చెదను పొమ్ము.

మ :—ముత్యాలు నాకు వద్దు. రత్నాలు నాకువద్దు. బాల నాగమ్మ భిక్షమే కావలె. (శంఖముపట్టుచు గంట వాయించును)

(నేపథ్యమున) అబ్బా! నీ పట్టు విడువకున్నావు. సుకుమారి యగు నా ముద్దరాలు—బాలెంతరాలు— ఇటునటు తిరుగలేని యశక్తురాలు—పురిటిమంచము విడువరాని దుస్థితియందున్న జవరాలు—రా లేదు. కానిపట్టు పట్టకు.

మ :—శాంభవీ! శాంకరీ! మల్లేశ్వరా! సోమేశ్వరా! భీమే శ్వరా! విశ్వేశ్వరా! వీరభద్రేశ్వరా! రామలింగేశ్వరా! జంగమేశ్వర్లు యీలా గుమ్మంకడ నిలుచుంటే పిల్లవానినిచూచి మురిసిపోతుందా? చూడు నా ప్రభావం.

(లోపల పిల్లవాడేడ్చుచుండును)

(నేపథ్యమున) నాయనా! ఏడ్వకు. ఏ గాలిసోకినదో? కొం చెము విభూతి మంత్రించి పెట్టెదను.

మ :—మహేశ్వర్లులంటే ఇంత నిర్లక్ష్యమా! శంభోశంకరా! గురుకటాక్షం! గురుకటాక్షం! భం మహేశ్వరా! భం వీరభద్రా! భం భం సాంభశివా! భం భం భం శాంబవీ మహేశ్వరోపవాసం మహాపాపం. భిక్షంపెట్టవలె యీ మహేశ్వర్లు యిచ్చటనుండి వెళ్ళి పోవలె

(నేపథ్యమున) బాగుంది యీ మంకుపట్టు ఇంత మూర్ఖము కూడదు. ఎంతచెప్పినా వినిపించుకోనవు. వరాలు, ముత్యాలు, రత్నా లు వద్దంటావు. ఆమె సెలవుప్రకారము మేము ఎన్నిచెప్పినా నీకు నచ్చదు. ఏమిచేతుము. నీ దారిని నీవు పొమ్మా.

మ :—అఁ! ఎంతమాట! ఎంతమాట! ప్రభువుల సంస్థానం త్రిభువులసంస్థానములో ధర్మం లేకపోవడమా? బాలనాగమ్మకు సం తతికై రక్షరేకుకట్టిన జంగందేవర నేమరసిపొయ్యారు. కాలవైపరీతము

నేనిచ్చిన బాలుడెట్లు దక్కుతాడో చూస్తాను శంకరా! శంకరా (శంఖము పట్టును)

(నేపథ్యమున) అమ్మా! మేమెన్ని చెప్పినను ఆ జంగము వినుట లేదు. నీవు భిక్షము పెట్టకున్న బాలుని జంపెదనని బెదరించుచున్నాడు ఏమిచేయవచ్చును? (కొంతనిశ్శబ్దము) అంత గట్టిపట్టుపట్టినచో నేనే! భిక్షము పెట్టెదనులే (తెరయెత్తగా తొట్టిలో బాలు నూపుచు బాల నాగమ్మ ప్రవేశించును.)

బా: —(జోలపాట)

జో సూర్యకులదీప జో ముద్దుపాప
జో సుగుణనిదాన జో పెన్నిధాన ॥జోజో॥
బంగారుతొట్టిలో పట్టుపాన్పునను
రంగుగా నిన్నుంచి రక్తి జారగను ॥జోజో॥
గజ్జెలం దెల్లమ్రోయ ఘల్లుఘల్లనుచు
సెజ్జపై లేచిలే చిందులుద్రొక్క ॥జోజో॥
పానుగంటిపురపు పాలకుండైన
జానుగా నినుబ్రోచు శంకరుడుకూన ॥జోజో॥

(ఒడిలో నుంచుకొని) నా ముద్దులయ్యా! ఏడుపుమానుము. ఆకలివేయుచున్నదా పాలుద్రావుము. ఏమిచేసిన నేడ్పు మానకున్నాడే కడుపుబ్బినట్లున్నదే. ముఖము అంతయు నెఱ్ఱగగందినదే? తండ్రీ! ఏడ్వకుము. నా కన్నతండ్రీ! ఏడ్వకుము. నా చిట్టిబాబూ! ఏడ్వకుము లాలిపాట పాడెద పండుకొనుము. (అని తొట్టిలో బాలునుంచి పాడును)

లా లి పా ట.

బాలా లాలీ సుగుణాలవాలా లాలీ।
జాలామేలా నిదురపొమ్ము గోలాలాలీ ॥హాయి॥
బూచీవాడు వచ్చెనయ్యా బుట్టతోనూ
దాచి ధనము దృష్టితీరు బూచిపోమెనూ ॥బాలా॥

కొంటెతనమునాను నీవు కొంగుబట్టుక నా కొంగుబట్టుక
కంటిసంజ్ఞ జేసెదవు దలనె తెలియగ ॥బాలా॥

ఇప్పటకి నేదతీరి కొంచెము నిద్రించినాడు. ఆ జంగమదేవరకు భిక్షము పెట్టవలయును. (పళ్ళెరమున ముత్యములు పోసికొని మరాఠీని సమీపించి) జంగమేశ్వరా! పిల్లవానిని నిదురబుచ్చుటకు నింతయాలస్యమైనది. క్షమింపుము భిక్షము పట్టుము.

మ :—(బాలనాగమ్మను చూచి తనలో) హా ఏమీ మెరుపుతీగ. (తర్కించి) కాదుకాదు మెరుపునకు నిలుకడయుండునా? రాకా విశాకరబింబమా? కాదుకాదు చంద్రబింబమునందు మత్సగలదు. దేవతామచ్చకంటియా కాదు నిమేషముగల్గియున్నది. యీ లలన తప్పక బాలనాగమ్మయే కావలెను. (ప్రకాశముగా) ఆఁ! ఆఁ! జంగమదేవర నీకంటికింత అలుంతిగ గనపడుచుండెనా? ఇంతవిశ్వాస ఘాతుకమా?

బా :— లేదు లేదు ఈ భిక్షగ్గైకొమ్ము. చిన్నవాడు లేచువేళ యైనది. స్తన్యము చేపువచ్చుచున్నది.

మ :—భిక్షము తెచ్చి అటురమ్మనదవేమి? ఇటు వచ్చి పెట్టుము

బా :— ఈ గిరులు దాటివచ్చుటకు నా ప్రాణనాథునియాజ్ఞ లేదు. కావున రాజాలను.

మ :—జంగమదేవరఅంటే అంతలోకువా? ఆ మహేశ్వరుని పూజించువేళ దాటినది. ఉపవాసం వుంచినపాపం రక్కుతాది. నీవు గిరులుదాటివచ్చి భిచ్చము పెట్టవలె నేను పట్టవలె.

బా :—నీ బిడ్డను తండ్రీ! నన్ను కరుణింపుము. నీ మనుమని బ్రోవుము. అయ్యో! నా ముద్దులయ్య యేడ్పు వినిపించుచున్నది. (తిరిగి తొట్టెదగ్గరకువెళ్ళి బాలు నెత్తుకొని ముద్దాడును) నా కన్నతండ్రీ జంగము పట్టినపట్టు విడుచుటలేదు. మీ తండ్రిగారి యానతిమీర రాదు. ఏమిచేయుదును? ఒకవంక జంగమదేవర కోపము—ఒకవంక

పతి యాజ్ఞోల్లంఘనము—ఒకవంక పాపము—ఒకవంక ధర్మలోపము—ఒకవంక అతిథినిరాకరణము—ఒకవంక ధర్మనిర్వాకరణము. శార్దూల ధ్వయమధ్యమందలి గోవురీతి నా ప్రాణములు చలించుచున్నవి. హా! పరమేశ్వరా!. దీనరక్షాధురీణా! ఈ యాపదనుండి రక్షింపుము. నా చిన్నతండ్రీ ఇట్లు నీ వేడ్చుచుండిన నే నెట్లు తాళుదునోయి—అడలకుము నిన్ను సర్వదా ఆ పతితపావనుడే బ్రోచునుగాత. (చిటికెన వ్రేలియుంగరము బాలుని వ్రేలికి తొడిగి) నాయనా! త్వరగనే వచ్చెద (అని చెక్కిలి వ్రేళ్ళతో నిమిరి ముద్దుపెట్టుకొని తొట్టిలో పడుకొనబెట్టి తిరిగి మరాఠీవద్దరకువచ్చి నాలుగుగిరులుదాటి) జంగమేశ్వరా! మహేశ్వరా! దాసురాల తప్పుసైపుము. భిక్ష గైకొనుము.

మ:—గిరులుదాటివచ్చినగాని భిక్షపట్టనని చెప్ప లేదా? ఇటు వచ్చి మా ప్రాణలింగని అర్చింపుము.

బా:—అయ్యో! ఇదియేమి దురవస్థ. అతిథి విపలీకృతమనోరథుడై పోవుట శ్రేయస్సుకాదు. ధర్మచ్యుతికివెరచి పతియానతి దాటుచుంటిని. (అని గిరులన్నియుదాటి యీవలకు వచ్చి భిక్షపెట్టును.)

మ:—ఆఁ! ఇప్పటికి మనస్సు చక్కబడినదా? సాంభమూర్తి వారి కటాక్షంగలిగి - భీమనాథుని యనుగ్రహంకలిగి - వీరభద్రుని కృపగలిగి - మల్లేశ్వరుని దయగలిగి - సోమేశ్వరుని కరుణగలిగి - శశ్వేశ్వరుని వాచ్ఛల్యంబు గలిగి (భం భం భం శంఖముపట్టి) సిరిసంపదలు గలిగి చల్లగ వర్ధిల్లవలె, (అని గంటవాయించుచు) విభూతితీసి నొసట బొట్టు పెట్టును.

బా:—(తిరిగి వెళ్లపోవును)

మ:—చేతిలోని బెత్తము ముట్టించును. బాలనాగమ్మ కుక్క అయి కుయ్యో కుయ్యో అని అరచుచు తొట్టెదగ్గరకు పరువెత్తును తొసనుండి ఛీ ఛీ యని అని అదలింతురు తిరిగి పైకి వచ్చును. మరాఠీ కుక్కమెడకు కొంజెంపట్టి లాగును. తెరపడును,

(రంగము—2 మరాఠీ గృహద్వారము. గాండ్లసంగు ప్రవేశించును.)

సం: —స్త్రీజాతికంతయు శిరోభూషణంబైనది శీలము. అట్టి శీలమును కొందరు ధనాపేక్ష చేతను – సంసారమందలి చిక్కులచేతను – లేమి చేతను – స్వేచ్ఛావిహారంబుచేతను – అననుకూల దాంపత్యము చేతను – మరాశల చేతను – దుష్టసహవాసంబులచేతను – పరగృహ వాసంబుచేతను - భర్త దూరదేశగతుడై చాలకాలము రాకుండుట చేతను – నిరంతరప్రవర్థిత బాల్యస్నేహితులచే నడ్డుచెప్పువాడు లేకుం డుటచేతను – సదా నిష్టురంభాషణంబులచేతను విడుచుచున్నారు. కటకటా ! ఎంతకష్టము. నేను ధనాశచే నీ మాయకానిని బ్రేమించి తిని. అహా ! ధనమా ! ఎంతపనినైన జేయింతువుకదా? నీ ప్రభుత్వము చాలవిచిత్రమైనది. స్నేహంబునకును బలవద్విరోధంబునకును నీవే కారణము తుదకు మాతాపుత్రులకు విరోధహేతువు నీవేకదా ? ప్రపంచమున ధనదేవతకు దాసులై ఎంతెంత నీచాతినీచకార్యంబు లొనర్చుచున్నారు. స్త్రీ శిశుభ్రూణహత్యలకుగాని, అభాగ్యుల నేకాం తంబున జంపుటకుగాని, గృహదాహంబునకుగాని, వెనుదీయక పోవుట ధనంబునందలి యాశయేకదా మూలము. (యోజించి) ధనంబునందలి ప్రభావముకూడ చాలగొప్పదే. ధనవంతుడే బలవంతుడు – ధనవం తుడే కీర్తిమంతుడు – ధనవంతుడే బుద్ధిమంతుడు – ధనవంతుడే గౌరవ నీయుడు – వాని నెల్లరు బూజించి దాసులగుచున్నారు. కావుననే "సర్వేజనాః కాంచన మాశ్రయంతి" అన్నారు. (ఇటునటు చూచి) వాడే మరాఠీ యొక్కడే వచ్చుచున్నాడు. నిరంతర ద్వారరక్షకరక్షితం బగు నంతఃపురమందలి నుత్తమక్షత్రియకాంతను చెరదెచ్చుటయన్న సామాన్యమా ?

మ :— (ప్రవేశించి) అరే సంగూ ! ఇచ్చటనిలచి యెవ్వరి కోసం చూస్తున్నావ్. భీతర్ ఆవో.

సం :—అయినదా నీకు శృంగభంగము. ఇదిగో ఈ సోఫాపై విశ్రమింపుము. యీ ఫలహారముల గైకొనుము.

మ:—(విశ్రమించి సంగుయిచ్చిన ఫలహారములు తినుచుండును)

సం :—వీని రుచి యెట్లున్నది ?

మ : (చిరునవ్వుతో) సంగూ చెప్పనా! ప్రియురాలి ముని పంటనొక్కిన కాటువలె యించుకసహిష్ణుతగలిగి నకారంబును యధ రామృతంబువలె తియ్యదనమునుగలిగి కష్టసుఖంబులువోలె విలసిల్లు చున్నవి.

సం :—నీ కింత కవిత్వ మెక్కడనుండి వచ్చినది ?

మ : — ఆరునెలలు స్నేహంచేస్తే వారు వీరవుతారుగాదూ! నీ స్నేహం యింత చేయించినది.

సం : —అందుచేత నీవుకూడ నా బోటి బోటివే.

మ : -(కోపముతో) అరే నీకీ బుద్ధితక్వామాటల్ బోలేతో.

సం :—ఇంట్లో బడాయిలు ఎన్నయినా చెప్పవచ్చును. వీథిలో కార్యము సాధించుకొని రావడముమాత్ర మసాధ్యము.

మ :—అది చేతగానివాళ్ళపని.

సం :—ఇది చేతనైనవాళ్ళగొప్ప.

మ : —నీ వన్నసంగతి నాకు బోధపడినదిలే. చూడుము. నీ గర్వము సర్వము నాశనముచేసే చిన్నదానిని తీసికొని వచ్చితిని. (అని జోలిలోని విభూది రాశిపోసి బెత్తమంటించును. బాలనాగమ్మ లేచి నిలబడును.)

సం :—(నివ్వెరపడును)

మ :—(నవ్వుచు) సంగూ! దేఖో మేరే తమాషా! ఇప్పుడు నా శక్తి బోధపడినదా ? మీ యిద్దరికి పోట్లాట పెట్టుతాను చూడు.

సం :— (తనలో) వీఁడు కలియుగ రావణుం డంతవాఁడు. కాకున్న శుద్ధాంత కాంతారత్నమును నెట్లు మాయచేసి తీసికొని

రాగలడు? అక్కటా! ఈయుత్తమరాలి కిట్టియిక్కట్లు రాతగునా? హా విధాతా! ఈయమ నీ కేమి యపకారమొనర్చినది? పరమదుర్మార్గుడైన వీనినుండి యీ సతీమణి తన మానంబెట్లు సంరక్షించుకొనునో గదా? ఈశ్వరా! వీనికడ వశ్యౌషధమంత్రంబులు లేవని నీమొకు తెలియునట్లు సూచించెదను. (ప్రకాశముగా) సకలమంత్రతంత్రాదు లెరింగిన ప్రోడయగు నీ మరాకీపాల నెట్లుపడితివి? వశ్యౌషధమంత్రశక్తులెవ్వానికి నసాధ్యంబు లేకదా? ఈ మరాకీ యప్పిచాడుకాడు. తనపప్పు నెగ్గవలెనను దురహంకారి

మ:— అరే సంగూ! నీనికి దుస్తంత్రాలుబోకొస్తే నీ పని యేమవుతుందో ఎంచుకో.

బా:—ఆహా! ఎంతపాపము. ఈ నికృష్టుడు మాయాజంగము వేశంబున నన్ను మోసగించి యింతద్రోహ మొనర్చెను.

మ:— అరే నన్ను దూషించితే అది నాకు సంతోషంకాని కోపంరాదు. నీ సుందరవదనారవిందముగాంచి యెవ్వడు నిను గోరకుండును? ఆ నడకల పసందు – ఆ వయ్యారము – ఆ మేని నిగనిగ – ఆ పైటలోని సింగారము – గాంచిన సన్యాసులుగూడ సంసారులుకారా? నీవంటి మిటారికత్తె నెందున కనివిని యెరుంగను. ఏదీ ఒక చిన్నముద్దు (అని సమీపించును.)

బా:—(తప్పుకొని) హా దురాత్మా! ఎంత దోసకారివి? ఏడు రోజుల పసిపాప నెడబాపి యిటువంటి ఘోరకార్య మొనర్చితివి. నీ వాడుతోడున బుట్టలేదా? నీ కేమి యపకృతి జేసితిని? నీచా! మృగరాజున కర్హమైన భోగ్యంబును సారమేయంబు గోరగలదా?

మ:—(నవ్వుచు) అచ్ఛా! ఆలాగను. నా ప్రభావము నీకు తెలియదు. నాతోడరమ్ము.

(తెరయెత్తగా మాయాజాలముతో గూడిన భూతగృహము కనిపించును)

బా:—(చూచి కంపించును) హా దైవమా! ఎంతదుర్గతి.

మ: —సుందరీ! ఈ భూతంబులెల్ల నాతోడ బోరాడి బోరాడి మదీయయసమాన శక్తిసామర్థ్యంబులకులోనై నాకు దాస్యంబు చేయుచున్నవి.

మ. కనుమా భూమిని యస్థిరపంజరములం ♦ గన్నారగన్నావో యా
ఘనభూతంబుల చెల్మిచే సతతమునే ♦ విశ్వంభరా మోహనమై
ఘనమై తంత్రమ యంబు నగుచున్ ♦ గాంతా సమూహంబు నా
కనువర్తింపగ జేయు జేయుచునుదీ ♦ యాజ్ఞానుసారంబుగన్.

(భూతముల నొక్కొక్క దానిని జూపించుచు)

మ. ఇది యంగేశు మృగాక్షి యాలల నప్పు ♦ ద్వీపాలు తన్వంగి యి
య్యది కాంభోజపురంధి యాతరుణి గా ♦ డాంఖోజపత్రాక్షి యా
ముదితంగాంచితె చోళభూవిభునిపూ ♦ వుంబోడి యా నాతికే
స దతుల్యాలరుమాధురీసరళ వా ♦ క్స్ఫూర్తి స్వయారంబునన్.

అరే బాలనాగూ! వీరిం తో సర్వసుఖంబు లనుభవించి యంతం బున నస్థిపంజరంబుల నర్పించుచున్నారు. వీరి యాత్మలు భూతజాలం బులై మద్వశవర్తులై సర్వకార్యనిర్వాహణంబు గావించుచుండును. ఈ జంభాసురాలి వజ్రింబుకన్నను - కాలుని దండంబుకన్నను - వరుణుని పాశంబుకన్నను - రాజరాజు దివ్యాయుధంబుకన్నను - చూడుము (అని మంత్రిపుత్రరను గనబరచి) ఇయ్యది భండనంబున ప్రచండదోర్దండ బలంబున వైరిబలంబుస జించి చెండాడుచుండును. ఈ భూతంబులన్నియు నా శక్తిపాటవంబు దెలిసికొని నన్ననువర్తింపుచున్నవి. ఓ కాంతామణీ! మనోహరకుసుమలతా సమాక్రాంతకుంజంబుల - స్ఫటికశిలావినిర్మిత సోపానకలిత నిర్మలజలపూరిత కాసారతీరంబుల - వివిధకుసుమిత పల్లవితభూరుహచ్ఛాయల - మనోహరసంగీత మాధురీగానవినోదంబుల - సరససల్లాపసౌఖ్యంబుల - చిలుక గోరవంకలవలె విహరింతము రమ్ము. అన్యునిగా నన్ను భావింపకుము.

బా :—ఛీ మూర్ఖా! ఎంతమాటంటివి? ఇట్టి దుర్భాషలాడిన నీ నాలుక వేయిచీలికలు గాకుండునా? ప్రపంచమున పవిత్రవంతమై – దిగంతయశోలతాక్రాంతమై – సద్వర్తనానల్ప పాతివ్రత్యమహిమాతిశయంబున భారతమాత గర్భంబున జన్మించి విశుద్ధకీర్తిగన్న హైందవ నారీలోకంబు – సకలసద్గుణంబుల కాలవాలంబగు నిన్ననుసరించుననుట కల్ల కల్ల – ఆత్మగౌరవం బడుగంటబెట్టి – మాతృపవిత్రగర్భంబునకు జిచ్చుపెట్టి – అన్యోన్య ప్రేమాతిరేకంబున చెట్టబట్టిన పతికంట దుమ్ముగొట్టి – కులటరీతి నిన్ననువర్తించు ననుకొంటివా? నీ మాయాజాలంబునబడి గిలగిల మత్స్యంబువలె కొట్టుకొను నేను సప్తకాసరపరిమితి గల గర్భస్థుండగు నర్భకువిడచి మనోక్లేశంబున వర్తించు నేను – ప్రతియానతి జవదాటిన దుష్టచారిణినగు నేను – ఉత్తమసతియనిపించుకొన్న భూలక్ష్మిగర్భసంజాతనగు నేను – పతి సుతవియోగభవంబున సతతము కన్నీటిధారాప్రవాహంబు గలిగించు నేను – పరమపతివ్రతయని నారీలోకంబున పేరెన్నికగన్న నేను – దుష్కీర్తి పాలగుదుననుకొంటివా? నా పాతివ్రత్యప్రభావంబున నిన్నిప్పుడే మడియింప జేసెదను గాని—

మ :—కాని గీని కట్టిపెట్టి నాయానతిప్రకారము వశవర్తినయ్యెదవా? లేక యీ భూతంబులకు బలియయ్యెదవా? త్వరగ జెప్పుము. (అని యేదియో మంత్రించును. భూతములు నోళ్ళు తెరచికొని నిలబడును.)

బా :—హా హా! ఎంతప్రమాదకరమైన సమయమాసన్నమైనది? ఈ మూర్ఖుడు నన్నిట బలాత్కరించిన నడ్డుపడువారెవ్వరు? కాత్రింబుగ భయంకరదంష్ట్రల వెలిజేసి భూతంబులు మ్రింగజూచుచున్నవి. కాకినై కలకాలము మనుటకన్న హంసనై ఆరునెలలు బ్రదుకుట లెస్స. ఇప్పుడీ దుష్టపిశాచంబులబారినుండి తప్పుకొను మార్గము లేదా? (యోజించి తనలో) ఆఁ! పొడసూపినది. వీనికి స్త్రీవశ్య మంత్రౌషధంబులు తెలియవు. కావున మానసంరక్షణకై యొకపన్నాగము

పన్నవలెను. (ప్రకాశముగా) ఇదిగో చెప్పుచున్నాను వినుము. నాకు పన్నెండేండ్ల వ్రతమున్నది. ఆ వ్రతముతీరువరకు నన్నంటరాదు. అంటిన తలపగిలి చచ్చెదవు జాగ్రత్త.

మ :— (తనలో) త్రాచుపాముకాటునకు మంత్రమున్నది. కాని పతివ్రత శాపంబునకు మంత్రతంత్రౌషధంబు లెవ్వియులేవు. ఇది నిజముగ శపిస్తే నాకు దిక్కులేదు. కావున గడువిచ్చుటయే శ్రేయస్కరము (ప్రకాశముగా) బాలనాగూ! నీ మాట కడుగు దాటను. అప్పుడైన నా మనోరథము—

బా :—అప్పటిసంగతి చూతము.

మ : — ఏదీ ఒకముద్దు—

బా :—ఈ హద్దు దాటెదవా?

మ :—దాటిన.

బా :—చచ్చెదవు చచ్చెదవు ముమ్మాటికీ చచ్చెదవు.

మ :—అరే నీకీ సలాంచేస్తాం దగ్గరకురాను. (అని వడకును)

బా :—(తనలో) ఇప్పటికీ గండము దైవవశమున దాటినది.

(తెర పడును.)

మూడవ రంగము—పానుగంటి పట్నము రాజవీధి

(తలారి రాముడు ఒకవైపునుండియు, రెండవవైపునుండి వృద్ధకంచుకియు ప్రవేశింతురు)

రా :—ఆ మాయజంగము నన్నెంతజేసెను? వాని మాయలో బడి సుడిగుండమున బడిపోయిన చెత్తవిధంబున మతిచలించి అట్టే పోతిని. ఆ పోకడ పోకడ నేటికి తిరిగి యీ పట్నము ప్రవేశింపగలిగితిని దర్బారువిశేషములేవియో తెలియలేదు. అదిగో అంతఃపురరక్షకుడు వృద్ధకంచుకి యిటు వచ్చుచున్నాడు.

కం :—(సమీపించి) అరే రాముడూ! ఏమయిపోయినావురా? నీ పహారా కావలా మండ కొంప ముంచినావురా.

రా:—(తెల్లపోయి) ఏమిరా మామా! ఆమాయముండకొడుకు ఏమి మంత్రించినాడో కాని నాడుపోయి నేడు వస్తిని. విశేషములేమి?

కం :—విశేషములు చాలాయున్నవి. మన బుల్లిప్రభువువారి తల్లి బాలనాగమ్మను మాయలమరాఠీ మాయచేసి చెఱదీసికొని పోయినాడు.

రా :— అయ్యో! ఆ జంగమఠాకీయా (కాబోలు) కూడా కుక్కను తెచ్చెను. ఆమె బాలనాగమ్మ కాబోలు. దానికై చాలసేపు వివాదపడితిని.

కం :—తరువాత కథవిను.

రా :—ఇంకేమి జరిగినది?

కం :— ఈ వర్తమానము గండికోటకు చేరినది. సూర్యవద్దిరాజు, చంద్రవద్దిరాజు, పాపవద్దిరాజు, శరభవద్దిరాజు, కామవద్దిరాజు, రామవద్దిరాజు, కార్యవద్దిరాజు—

రా :—(ఆత్రముతో) మన చిన్నప్రభువు లేకుండకు నేమి?

కం :—పన్నెండు వేల బలముతో తుపాకులు ఫిరంగులు, ఏనుంగులు, గుర్రాలతో నాగళ్ళపూడి గట్టుమీదకు వెళ్ళి ముట్టడించిరి.

రా :—తర్వాత?

కం :—ఏమున్నది నాయనా! (ఏడ్చును)

రా :—ఏడ్చేద వెందులకు సంగతి చెప్పుము.

కం :—వానిచే నచ్చట—

రా :—ఏమి?

కం :—హాతముగావింపబడిరి దీనికంతకు మూలకారణమునీవు

రా :—ఔను. నా తెలివితక్కువయే యీముప్పునకు హేతువు పురిటిలోని పిల్లవాడు.

కం :—పెద్దతల్లులచేఁ బెంపబడి నిక్షేపముగానున్నాడు.

రా :—సంతోషము.

కం:—ఏమి సంతోషము? వెన్న పారవేసి వ్రేలు నాకినట్లున్నది

రా :  ఆ బాలప్రభువును గర్శించి నా అపరాధములు మన్నింప వేడుకొందును

కం :— అదిగో ఆ బాలవర్ధిరాజు శరశరాసనధరుడై యిటు వచ్చుచున్నాడు.

(బాలవర్ధిరాజు ప్రవేశించును.)

రా :—(సాగిలపడి) మహారాజకుమారా! మీకు కష్టపరంపరలకు హేతుమాత్రుడైన మీ పాదసేవకుడు తలారి రాముడు నమస్కరించుచున్నాడు. నన్ను రక్షించి యభయమిచ్చుగాక మీ చరణములు విడువను. (అని మ్రొక్కును)

బా-వ :—లే! నీ వెవరవు?

రా :—బాలప్రభూ! తమపాదపద్మ సేవకుఁడ తలారి రాముడను

బా-వ :—సరే పొమ్ము.

రా :—చిత్తము దేవా?

బా-వ :—కంచుకీ!

కం :—బాబూ! ఏమి సెలవు?

బా-వ :—పహరా మాని యిక్కడనుంటి వేమి?

కం :—బాబయ్యా! చిన్నపనియుండి యిటువచ్చితిని త్వరగనే వెళ్ళుచుంటిని. దారిలో యీ రాముడు కనిపించినాడు.

బా-వ :— సరే! నీపనియం దప్రమత్తుడవై యుండుము పొమ్ము.

(రాముడు కంచుకి నిష్క్రమింతురు)

బా :— (ధనస్సున బాణము సంధించి) శరసంధానలక్ష్యము. చూడవలెను. (ఏగుటనుండి నీళ్ళకడవతో నంబి నరసమ్మ ప్రవేశించును

బాలుడు బాణము విడచును. కడవ పగిలిపోయి బాణము కాలి బొట
మన్రవేలికి తగిలి రక్తము కారును.)

న :—హా! చచ్చితి చచ్చితి. ఎవడురా యీ దుర్మార్గుడు ?

బా :—అయ్యో! ఎంతప్రమాదము. నేను బాలవర్ధిరాజును.

న :—తలితండ్రులు చెరలుపోగా అనాథల బాధించుటకే నీవు బ్రతికినావురా ? నీ ఆయువెంత గట్టిదోకాని.

బా :— (చకితుండై) అయ్యో! నా తలిదండ్రులు చెరలు పోయినారా ? (నరసమ్మతో) నరసమ్మా! నీకు మ్రొక్కెదను. ఈ సంగతి సవిస్తరముగ జెప్పుము.

న:—ఛీ! మూర్ఖా! నీతోడ మాటలాడరాదు. నరముడవుకావు.

బా :—నిజము చెప్పెదవా? (కత్తిదూసి) దీని కెరయయ్యెదవా?

న :—(భయముతో వడకుచు) నన్నెందుకు చంపెద ? నిజము చెప్పెదను. నీవు యేడురోజుల పురిటింటిలోనుండగా నాగళ్ళపూశిగట్టు యేలే మాయలమరాఠీ, నీ తల్లి బాలనాగమ్మను చెర దీసికొనిపోయెను.

బా :—అక్కటా! తర్వాత.

న :—నీ తండ్రి లేఖ్కరకు తెలిసి వానిమీదికి దండుతోడ భండనంబునకుబోయి యచ్చట నిహతులైరి అని కొందరు, శిలలైరని కొందరు చెప్పెదరు.

బా :—నన్ను పెంచుచున్న మా యమ్మ లెవ్వరు ?

న :—సూర్యనాగమ్మ, చంద్రనాగమ్మ, ఉత్తరకన్యక, దక్షిణ కన్యక, పడాలనాగమ్మ, మునికన్యక, వీరార్గు రప్పచెల్లెండ్రు వీరికి కడగొట్టు నీ తల్లి బాలనాగమ్మ.

బా :—ఐతే వీరు పెదతల్లులా ?

న :—అవును నాయనా!

బా :—నన్ను దీవింపుము. (అని సమస్కరించును)

న:—నీ చేతిలో మరాఠీ చనిపోవునుగాక, తల్లిదండ్రుల చెర విడిపింతువుగాక పొమ్ము.

బా:—నా కంతశక్తియేది?

న:— నీవు కాళికాదేవిని పూజింపుము. సర్వసుఖంబులు చేకూరును. నాయనా! చల్లగవర్ధిల్లుము. (నిష్క్రమించును.)

బా:—(పరిక్రమించుచు) ఈ సంగతి యిదివరకు తెలిసినచో నింతవరకు తలిదండ్రుల గష్టబడనిత్తునా? గలజలసేతుబంధనమేల? (కాళికాలయము సమీపించి చేతులు జోడించి)

శ్లో. మాణిక్యవీణాము పలాలయంతి
మదాలసాం మంజుల వాగ్విలాసాం
మాహేంద్ర నీలద్యుతి కోమలాంగీం
మాతంగ కన్యాం మలసాస్మరామి.

శ్లో. చతుర్భుజే చంద్రకళావతంశే
కుచోన్నతే కుంకుమరాగశోణి
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేకమాతః.

దండకము—శ్రీమన్మహాకాళి! ఓంకాళి! శ్రీకాళి! కాళీ! భవానీ! విశాలాక్షి! మీనాక్షి! కామాక్షి! దుర్గా! పురారిప్రియా! సర్వలోకంబులన్ సర్వభూతంబులన్ సృష్టిగావింపుచున్ శక్తివై బ్రోతువే మృత్యువై ద్రుంతువే ఆదిశక్తి! పరాశక్తి వీవేకదా మూడురూపంబులం గౌరినాశంకరుం లక్ష్మినా విష్ణునిం బాహ్మినా బ్రహ్మతోగూడి స్వేచ్ఛావిహారంబు గావింతువోతల్లి నే శక్తిహీనుండ, బాలుండ, వర్ణింప నే నెంతవాడం గృపాదృష్టి మన్నింపవే శక్తిసామర్థ్యముగూర్పవే యంబ దేవీ! నమస్తే నమస్తే నమస్తే నమః

(కాళి ప్రత్యక్షమై)

కా :—వత్సా! బాలవర్ధిరాజా! నీకు సకలశుభంబులు కలుగునుగాక. ఈ చంద్రాయుధంబు స్వీకరింపుము. ఇది త్రిమూర్తులచే నీ పితామహున కీయబడినది. (అని ఫిరంగికత్తి నిచ్చును)

బా :—(పుచ్చుకొని కన్నుల కద్దుకొని) తల్లీ! మా తాత కెట్లు వచ్చినదో చెప్పెదవా?

కా :—నాకను మర్గసును కలహము కలిగినది. అందు మాకు తీర్పరియై నీ తాత పొలిమేరలు స్థాపించెను. దానికి మెచ్చి త్రిమూర్తులీ యాయుధం బొసంగిరి.

బా :—మహాప్రసాదము.

కా :—కుర్రా! మరాఠీపురంబున తంబళ్ళపెద్ద అనునదికలదు దానికి దౌహిత్రుడననియు పేరు వీరయ్యఅనియు, తల్లి నాగమ్మ, తండ్రి శరభయ్య అని చెప్పుము. కార్యసాఫల్యమొందగలవు. సహస్ర నాగసత్వ మిచ్చితిని.

బా :—చిత్తము. తల్లీ! ధన్యుడను.

(తెర వ్రాలును.)

చతుర్థాంకము—సంపూర్ణము.





# బాలవాగష్ట

## పంచమాంకము

మొదటి రంగము—పులిరాజుపట్నములో చాకలిగూడెంలో తిప్పని ఇల్లు

(చాకలి తిప్పడు, భార్య సితాలి ప్రవేశింతురు.)

సి :—అదేమామా! లెగురా లెగు. పొద్దొడిసింది కర్ణం గోరు, మునసిబోరు గామ్ముల్లో గొప్పోరుగుడ్డ లుతకంలేందేమని దంచేస్తున్నారు లే.

తి :— ఓసి నంజా! పోయే. గామ్ములో పబువులంటే తిప్పడికేం బయ్యం.

సి :—గుడ్డలు తెచ్చి సేనా దినాల్లయిందిరా! కనముడి తేసంజా! లమ్మిడీ! అని తిట్టేస్తున్నారు లే.

తి :— ఓసీ నీయమ్మా.........తల్లీ సిగ్గోయ్యా! నంజా! యేపుకొని తింటున్నావ్ లెగిశానంటే..

సి :—కమ్మునగొట్టి గూనకేసి ఉకసేశా! గుంజేసియ్యి, గంజెట్టు ఆరేస్తా.

తి :—ఒరేయి! రేతిరికాడనుంచి గుడ్డలో గుడ్డలో! ఒకే గుడ్డలోయిబాబూ! సంపేస్తుండావే. నీళ్ళాటరేవుకాడ పులిమాట మరశుండావ్ కామోసు,

సి :— తెల్లారితే యేం జేస్తాదీ పులి గిలి.

తి :—నంజా! నాకు తెల్సులే. పులి నన్నేసుకెడితే (మిర్రుగ జూచి) నీ యిష్టమొచ్చినాడితో—

సి :—ఏంటీమాట.

తి :—గూడెంలో సాకలోళ్ళంతా యిళ్ళలో దొంగుంటే నన్నే పుక్కొని తింటూందిరోయి. ఈరన్న కళ్లుముంతట్టుకొచ్చాడండి.

సి :—ఇంకా దేలేదురా మామా ! లెగు లెగు.

తి :—అబ్బబ్బ! కొం తగ్గినిప్పయినా తే! సుట్టపీక గాల్చుకుంటా.

సి :—గూనదగ్గ కెళ్ళి కాల్చుకోరాదూ !

తి : —(లేచి) ఏంటంటావ్ నంజా ! తిప్పడంటే ఏమనుకున్నావ్ (కళ్ళు మిటకరించుచు)

గీ. కాళ్ళకాడికి రావాలె ♦

సి :—కాకపోతే

తి :—వీపు బద్దలు కావాలె ♦

సి :— వేడుకొంటె

తి :—ముద్దు వెట్టుకొంటూండావె ♦

సి :—ముసి ముసి ముసి

తి :—నవ్వులాడు కుంటూండావె ♦

సి :—నయము కులుక.

(నే పథ్యమున) ఒరే తిప్పా ! తిప్పా !

తి :—బాబయ్యా ! వస్తూండా ! వస్తూండా.

(తిరిగి నేపథ్యమున) బట్టలమాట యేమిటిరా ?

తి :—లేస్తా నెల్లండి బాబయ్యా ! రేతిరికి ఒలేయి చూసంపుకొని తినేస్తుండాలే. భయమడితే తప్పుతుందా ! కాయిట్లో గుడ్డలేయి. పానాలు గుటగుటా... మంటున్నాయే.

సి :—నే నెనకాలొత్తానుగా !

తి : — ఆ మూలబల్లెం, గొడ్డలీకూడా మెట్టు. (సగర్వంగా) ఆ పులి నీ బల్లెంతో నిలువునా పొడిసి పారెయ్యనూ. తిప్పడంటే సామానుడా యేంటి ?

సి : — నే నెరగనంటోయి మామా ?

తి :—(కావిడి భుజముపై బెట్టుకొని పరిక్రమించును. తెర యెత్తగా నీళ్ళాటరేవు కనిపించును. గుడ్డలుకావిడి దింపి)

తి :—ఏడధాపురించిందాపులి బాబూ ! రోజుగోజూ అయిదాగ్గురిని నమాంతముగా తినేస్తోంది. ఆ పులిని సంపినోడికి దన పిల్లనిచ్చి పెళ్ళిసేస్తానంటాడు రాజుగోరు పతినమ్ట్టారు. (కులుకుచు) నా సేతుల్లో పులి సచ్చిందంటే నా సామిరంగా (అని గంతువేస్తూ) రాజుగారి అల్లుణ్ణయి (శరీరం విరుచుకొంటూ) మేడలన్నీ నాయే – మిద్దెలన్నీ నాయే పట్టుబొట్లలుఅన్నీ–అన్నీ–అన్నీ యేంతేస్ (చెయ్యిత్రిప్పుచూ) రాజుగోరి అమ్మాయే (తలయూపుచు) పెండ్లాడుతూంటే (గర్వంతో) ఒచ్చే యేడూ పోయేవోడూ తిప్పరాజుగోరంటూంటే నా షోకు – నా కులుకు – (ఒళ్ళు విరుచుకుంటూ) నా వొయ్యారం – నా సింగారం – (గూను తడుముకొని) అరే పాడుగూనొటొచ్చేసిందిరా. లేకుంటే నా అంత అందగాడుంటాడా ? (యోజించి) ఒకేళ రాజుగోరు అంతమాట సెయ్యకపోతే ఏంజేసేదీ నిలమెట్టడిగేసేయ్యనూ ? పబువయితే బుర్రకొట్టేస్తాడేం ఎందుకులేరా యానీరాతంటా.

కం. తిప్పడు చింమ్మా దప్పడు
ఒప్పడు గుడ్డలుదుక బా ♦ గొప్పెడుదాకం
జెప్పడు ఋసరపు కూతలు
తిప్పడు పబుకార్యములకు ♦ తిప్పడు మేల్మేల్.

ఓరొచ్చేసిందిరా కయిత్తంగాదురా పయిత్తం లేదురా శయిత్తం (ఎగురుచూ అదటుగా చిచ్చిపోయిన పులినిజూచి) ఓయి బాబో పులి పులి. నా కొంపత్రివ్వేస్తుంటే (వెనుకకు పారిపోయి వణకుచు వగర్చుకొనుచు త్వరగ చెట్టుపై కెక్కి– సముదాయించుకొని) ఇయ్యాల పొద్దున్నే ఏరి మొగం నూసానో యీా గండం తప్పిందిబాబూ ! (నిదానించి)

దొంగుందికామట్టి నా పానాలు దక్కాయి. (అని కొమ్మ ఒకటి విరచి పులిమీదవైచును పులి కదలకుండును.) ఓయి నాయినో! యిదికాని లెగిసిందంటే సెట్టుకాడా గద్దేసుకొని కూకుంటుంది. (గుండె కొట్టుకొని) నా పానంమీది కొచ్చేస్తుంది. నెగవకుండానే పొడాలె (అని క్రిందికిదిగి బల్లెము చేతబట్టుకొని మెలమెల్లగా అడుగులిడుచు పులిని సమీపించి) సావు ముందాకూతురా (అని పొడుచును పులి కదలదు యోజించి) దొంగేసం యేసిందెమో యికేముదోయి. బుర్రి లటుక్కున నొక్కేస్తే (వడకుచు వెన్కకు పారిపోయి) సంపిన యీ సమయాన్నే సంపాలె. (అని ధైర్యముతో తిరిగివచ్చి బల్లెముతో పొడుచును) (పులి కదలదు) అరే ఒక పోటుకే సచ్చిందా పులి. (అని గర్వంతో పులిమీద కూర్చుని నిదానించి) ఇది సచ్చినపులి గోళ్లు తోక ఎవ్వరో కోసుకొనిపోయారు. యీ కాళ్ళు తోక రాజుగోరికి సూపించి (చంకలు కొట్టుకొని) అల్లుణ్ణవుతాను. (అని గోళ్లు తోక నరుకును)

(తెర పడును.)

## రెండవ రంగము — రాజ దర్బారు.

(పులిపట్నపురాజు, మంత్రి తక్కిన యుద్యోగస్తులు ప్రవేశింతురు)

రా:—అమాత్యశేఖరా!

సీ. ఎన్నాళ్ళనుండియో ♦ ఎన్నెన్నొ ప్రాణుల
జంపు వ్యాఘ్రము జంపు ♦ జనుడు లేడు
శార్దూల హంతకు ♦ చక్కని ద్రౌపదీ
యాత్మజాత నొసంగ ♦ ననుమతించి
యుంటి యేడులుదాటె ♦ యొక్కడైన నురాడు
నేనంచు ముందుకు ♦ నిశ్చయముగ

ప్రతిన వ్యర్థంబైన ♦ పరిణయమెటు జేతు
కులమున దుష్కీర్తి ♦ కుదురుపడియె

ఆ॥ వె॥ కూతు బెండ్లి జేసి ♦ కోమరోప్ప రాజ్యంబు
నల్లు డేలుకొనగ ♦ నతిముదంబు
జెందునా కోర్కె ♦ చేకూరునో? లేదో?
దైవమేమిచేయ ♦ దలచినదియొ.

అయ్యో! ఎట్టి దుష్కరమైన ప్రతినబట్టితి. సర్వసర్వంసహా చక్రింబన క్రవిక్రమంబున పరిపాలించిన సార్వభౌములకాలపట్టయి—కకుబంతంబులకు విశుద్ధయశశ్చంద్రికల పరగించిన రాజన్యచూడామణులకు స్థానంబై పరబలంబులన సమాన శౌర్యధైర్యంబున చించి చెండాడు వీరభటుని కాయంబునకు నెలవైయొప్పు నీ భూమండలంబున పులిని సంహరించుటకు నొక మొనగాడైన లేకపోవుట చింతాస్పదము.

మం:—మహాప్రభూ! దేవరవారు సెలవిచ్చినది యదార్థము. ఐనను పూర్వపు భూపాలురు పట్టిన ప్రతినలు చెల్లలేదా? ఏవీరుఁడో యొకఁడుండకపోఁడు.

రా:—ఏమో? నేను జూడ దుర్భర జరాక్రాంతశరీరుండనై యోపిక లేకుంటిని. ముద్దు ముచ్చటలకు బెట్టిపుట్టినగాని శుభములు చేకూరవు.

మం:—రాజచంద్రమా! తమకోరిక సఫలమగు సమయమాసన్నమైనది. మేరు నగధీరులగు ప్రభువువారిట్లాడిన నేను వచించుటకు ధైర్యము చాలకున్నది.

రా:—మంత్రీ! ముఖశ్రీతికై యిట్లాడుచుండుట సహజమే?

ద్వా:—(ప్రవేశించి) జయము జయము మహారాజా! ఎవడో పులిన జంపితినని వచ్చి దర్శనమునకై తొందరపడుచున్నాడు.

రా :—త్వరగ బ్రవేశపెట్టుము.

ద్వా :—చిత్తము మహాప్రభూ ! (నిష్క్రమించును.)

సభ్యులు :—(సంతోషముతో) ఏలినవారి కోర్కె సఫలమైనది సంతోషము.

ద్వా :—(తిరిగి తిప్పనితో బ్రవేశించి) వారే ప్రభువువారు. (నిష్క్రమించును.)

తి :—దండాలు మారాజా ! దండాలు.

రా :—ఎవరవునీవు ? మంత్రీ ! సంగతి అంతయు విచారింపుము

తి :—ఈగామ్ముంలోవాణ్ణే బాబయ్యా ! (కళ్లు మిటకరించుచు) కులంతక్కువోణ్ణని చూడకండి.

మం :—నీ పేరెవరు ? ఏకులము ?

తి :—ఏమయ్యా ! నీ వెవ్వారంటావ్ ఎందరెందరో సంపలేని పులిని సంపిన యీారున్ని.

మం :—(నవ్వుచు) సంగతి చెప్పుము.

తి :—ఆలాగను ? యీాయూళ్ళో సాకలగూడెం నాకాపరం. నన్ను తిప్పడంటారండి మారాజా ! తిప్పడంటే తిప్పడా !

కం॥ తిప్పడు చింమ్మాదప్పడు. (అనుపద్యము చదువును.)

రా :—అయ్యో ! ఏమి దురదృష్టము ? తుదకు చాకలివాని చేత నా శార్దూలము హతమయ్యెను.

తి :—మామయ్యా ! పులినిసంపిన యివరం సెలవిస్తాను మనవి చేసుకొండి.

రా :—ఇట్టి అప్రాచ్యుడు నాముద్దులసుతకు భర్త. హావిధీ ! నీచేతలచింత్యములుకదా ?

మం :—చెప్పుము.

త్రి:—యిద్యోల పొద్దొడిసినాక గుడ్డలు కాయిసేసుకోని నీళ్ళాటికేప్పుకెళ్ళా సూస్తినిగందా (ఎగిరిపడి) పులి పాదసాటున దాంగుంది. మారాజా! సప్పుడు సెయ్యకుంటా (బల్లెముచూపి) గుంపె తెగబొడిశా. (ఎగిరి గంతువేసి) బాబో ఎంసెప్పను (పండ్లు గిట్టకరచి) మూల్గి మూల్గి (గుండెకొట్టుకోని) పానాలు అమ్మట్టే ఒగ్గేసింది. (రాజువైపు దిరిగి) నేనెంతకార్యం సేసానో సూసారా? పెళ్ళిసెయ్యటం మిగిలింది మారాజా!

రా:—ఎంతదుర్భరము.

(అని యేమో చెప్పబోవుచుండగా ద్వారపాలుడు ప్రవేశించి)

ద్వా:—మహారాజా! చిరంజీవులు తమకిమ్మని హంసయాన నాకీ చీటియిచ్చి వెళ్ళిపోయినది. (అని చీటి యిచ్చును.)

రాజు:—(పుచ్చుకొని) మంత్రివర్యా! యీ కమ్మ చదువుము.

మం:—(చదువును.) జనకా! వందనములు. పులిని జంపిన వీరుడు యీ పురమున ధర్మసత్రమందుండెను. తమకు తెలియపర్చితిని.

ఇట్లు విధేయురాలు పుష్పవేణి.

రా:—(ఆశ్చర్యముతో) ఏమీ! బెబ్బులిజంపిన బల్లిదుం డీ పురంబుననే యుండెనా? మంత్రిశేఖరా! సత్కారపురస్సరంబుగ మన దర్బారునకు వెంటబెట్టుకొని రమ్ము.

మం:—చిత్తము మహాప్రభూ! (నిష్క్రమించి బాలవర్ధిరాజుతో మరల ప్రవేశించును)

రా:—(సింహాసనముదిగి ఎదురువెళ్ళి కౌగలించుకొని తన సింహాసనముపై గూర్చుండబెట్టుకొని) నీ వెవరి కుమారుడవు. నామధేయ మేమి?

బా:—రాజవర్యా! నేను పాంచాలదేశాధీశుడగు కార్యవర్ధిరాజ కుమారుడను. బాలవర్ధిరాజనువాడ. నాతల్లి బాలనాగమ్మను

మాయల మరాఠీ చెఱగొనిపోయెను. వదలిపించుకొని వచ్చుటకై వెళ్ళుచుంటిని.

తి :— (భయముతో వణకుచు) కొంప మునిగింది బాబోయి. ఏం జేసేది? ఈడెక్కడ దాపురించాడు. (అక్కడ నక్కడకు బరువెత్తును)

రా :— ఎంతపని జరిగినది. ఆ దుర్మార్గునిచర్య లత్యద్భుతము లని ప్రతీతి. మా యిక్కట్లనుబాపుటకా పరమేశ్వరుడే నిన్ను రప్పించెను. శార్దూలమూలమున ననేకులు మరణించిరి.

బా :— అది యొక లెక్కకాదు. దుష్టసత్వమును వధించుట శూరధర్మము.

రా :— ఈ చాకలితిప్పడు "తాను పులిని జంపితినని యు, తనకు నా ముద్దులసుత నివ్వమనియు, తగవు సేయుచున్నాడు.

బా :— ఎప్పుడు చంపితివిరా?

తి :— పొద్దున్న కాయుకొసు కెళ్ళి దాంగున్న పులినిబొడిచినాను.

బా :— అప్పటికి బ్రతికియున్నదా? చచ్చిపోయినదా?

తి :— ఆ దేవరు సూసారు?

బా :— దాని గోళ్ళు

తి :— పబువ్వార్కి సూమెట్ట

బా :— ఈ మొండి గోళ్ళనా? (అని తన జేబులోని పులి గోళ్ళను దీయును)

తి :— ఇంకేముంది సచ్చినానోయి. (అని పరుగులు పెట్టును)

రా :— (కోపముతో) ఓరి నీచా! నేనే పులిని జంపితినని ప్రగల్భములాడితివే. నిన్నిపు డేమిచేసెదనో చూడుము. మంత్రీ! వీని చర్మము వలిపించి వేయుము. ఎన్నడు ఎవ్వరిట్టి దుష్టచర్యలకుబోరు.

మం :— మహాప్రసాదము దేవరా! ఎవరక్కడ?

ద్వా :— (ప్రవేశించి) ఏమి సెలవు?

మం :— రాజుగారియాజ్ఞ అని చెప్పి వీని చర్మ మొలిపింపుము.

తి :—బాబయ్యా! బుద్ధొచ్చించి. ఎన్నడిట్టి పనిచెయ్యను (అని తెంపలు వేసుకొనును తిప్పరితో ద్వారపాలుడు (నిష్క్రమించును)

రా :— కుమారా! నూతన పుత్రిని బహుమానమై తగినబలములతో బోయి మీరా మహారాణిని సంత మొందింపుము,

బా :—పితృనా! తలిదండ్రులు క్షేమములు గుమనించుండ నాకు శుభము ఏమి సంతోషప్రదము. గాన తల్లిదండ్రులచెంత వసలి పించినతర్వాత మీరా యిష్టానుసార మొసగింపవచ్చును

పు :—తథాస్తు

(అందరు నిష్క్రమింతురు)

పంచమాంకము - సంపూర్ణము.

---



# బాలనాగమ్మ

## షష్ఠాంకము.

తంబళ్ళపెద్ద గృహము—తంబళ్ళపెద్ద ప్రవేశించును.

తం:—బ్రతికియుండినసంతోషము ఒక్కప్పటికైన కలుగునని చెప్పిన మాట దబ్బరకాదు. నా భార్య సంహరవిడచి ఎంతకాలమైనదోగాని యిప్పుడు నా దౌహిత్రుడు తంబళ్ళ పిరయ్యవచ్చి నా కన్నులు చల్లబరచినాడు, నా కుమార్తెను నాగమ్మ, అల్లుడు శరభయ్య చనిపోయినందుకు విచారము కలిగినను, పిల్లవాని సౌందర్యము, మంచితనము, మనస్సునకు బరమానందము కలిగించుచున్నది. (ప్రొద్దుచూచి) అబ్బో! చాలప్రొద్దుపోయినది మరాళికి పూలమాలలు పట్టుకొని వెళ్ళవలెను. మనుమడు కట్టుమాలలకు మరాళి బ్రహ్మానందము పొందుచున్నాడు. వీనివల్ల నాకు విశేషధనలాభము కలుగుచున్నది. నా మనుమని చూడదలచినాడు. చూపించెదను, (నిష్క్రమించును)

ఇది విష్కంభము.

మొదటి రంగము—మసీదులో భూతిగృహము

(బాలనాగమ్మ ప్రవేశించును.)

బా:—హా హతవిధీ! నే నెంత దురదృష్టము గావించితిని? సతులకు దైవము పతియే. పతియానతిదాటుట దైవద్రోహ మొనర్చుటయే

గీ. సతికి దైవంబు పతియంట • సత్యమగుట
దలచి వర్తింపనేరని • తరుణి కెపుడు
కష్టసంఘంబు రాకున్నె • నిష్ఠురముగ
దానికేను తార్కాణంబు • తలచిచూడ.

నా [illegible]నర్చిన మహాపాపంబె నన్ను కట్టికుడిపినది. అయ్యో! నాకు గతి లేదు. నేను మరొకనికి బెట్టిన గతువు సమీపించుచున్నది. ఆహా కుమారా ఈ నిర్భాగ్యురాలు - పతిద్రోహురాలు - గర్భస్థు నర్భకు నివిడచి కన్నీటి ధారల మున్నీరుగ బ్రవహింపజేయు నధమురాలు - జీవించియున్నదని తలంచితివా? ఏడురోజుల పసిబాలుండవు. నీ విప్పటివరకు బ్రదికి బట్టకట్టితివా? పాలు నిచ్చువారు లేక పోతపాలతో నెట్లు జీవించితివో యితం(డీ ముద్దులు మూటగట్టు నీ ముఖ మెన్నడయిన జూచుభాగ్యము నాకు గలుగునా? నా చిటికెన వ్రేలి యుంగరము పూలమాలలో నెట్లు వచ్చినది? నా ముదిపెనుదొంతి వ్రేలికి బెట్టినదికదా? ఆ యుంగరము ఒక వేళ బాల్యచాపలంబున నిటువచ్చిన నిన్ను మరొకరికి బ్రదుకనిచ్చునా? అక్కటా! నీ తండ్రి ల రాళ్ళ గావించినాడే ఈదుర్భరచింతాభరంబు భరియింపజాలను. దేవతా సార్వభౌములారా! ఈ యాపన్నురాలి విన్నప మాలింపరా? అయ్యో! కుమారా! నీ తల్లిని యేమి యెరుంగుదువు?

(బాలవర్ధిరాజు ప్రవేశించును)

బా-నా:—(చూచి) హా చచ్చితివి చచ్చితివి దుర్మార్గుడా! కపటవేషధారి! నన్నిట్లు మోసగించుట ధర్మముకాదు.

బా-వ:—తల్లీ! నీ తనయుడను బాలవర్ధిరాజనువాడను నమస్కరించుచున్నాను. (నమస్కరించును)

బా-నా! హా నీచా! దగ్గరకు రాకుము. వచ్చిన చచ్చెదవు.

బా-వ :—అక్కటా! క్షత్రితల్లి! నీ కుమారుడను. నమ్ముము.

బా-నా :— హా హా! ఎంతమోహము. ఇట్టి మాయలపన్ని యుత్తమురాండ్రి బాధించుట తగదు.

బా-వ :— అమ్మా! నీ గర్భసంభూతుడ. నన్ను విశ్వసియుం పుటచేత నానవాలు పట్టలేకుంటివి.

బా-నా :—(తనలో) వీనిని జూచుచుండుటచేత నా కానందము గలుగుచున్నది. ఈ సంతోషము స్థిరముగా నుండునుగాక. (ప్రకా) నీవు నా కుమారుడవా? నాకు మారక నవా?

బా-వ :—మాతా!

గీ. నమ్మ నేరవు నీ సుతు ♦ నెమ్మనమున
నంగులీయక మంపితి ♦ నానవాలు
ముద్దరాలవు మున్నెట్లొ ♦ మోసపోతి
నకట కాలవైరుధ్యమే ♦ మందుతల్లి.

బా-నా :— (తనలో) ఆఁ! సత్యము చెప్పవచ్చుచున్నది. దైవమా! ఇది ఏమి అన్యాయము. ఎక్కడి వానుగంటిపట్నము. ఎక్కడిదీ మాయలమారి గృహము వివిధభూతంబులచే బరిరక్షితంబై గాలి కైన చొరనలవికాని యీ నివాసమునకు మత్కుమారు డెట్లు రాగలడు ఏమో రాకూడదా అను కొంతయూస బాధింపుచున్నది. (ప్రకా) నీవు యదార్థముగ నా కుమారుడవని నమ్మజాలను

బా వ :—అమ్మా! నిన్నెట్లు నమ్మింతును? ఓ భూమిదేవి! సూర్యచంద్రాదులారా! మీరయిన యదార్థము వచింపుడు

(నే పద్యమున) నీ కుమారుడే వీడు నమ్ముము. సందేహింపకు.

బా-నా :—నాయనా! ఎన్నాళ్ళకు నీ సుందరవదనముగంటి నోయి. (అని కౌగిలించుకొని విచారించును.)

బా-వ :— అంబా! ఎందులకీ వృధాపరిదేవనము? కర్తవ్య మాలోచింపవలె. నా కిందు తడవుండుట కార్యలేదు.

బా-నా :— (ఆశ్చర్యముతో) ఆ మాయకాని సెలవుమీద నెట్లు వస్తివోయి తండ్రీ!

బా-వ :—జననీ! తంబళ్ళపెద్దను దౌహిత్రుడనని యాశ్రయించి పుష్పమాలలచే మహారాణిని మెప్పించి వాని యానతిమెయి నిందు బ్రవేశించితిని.

బా-నా :—బాగు బాగు. ముందు సంగతి.

బా-వ :—నీవు నానిని మనోహరవేషంబున మతిచలింపఁజేసి యాయుపట్టు తెలిసికొని నాకు తెలియజేయుము (అని చెవిలో నేదియో చెప్పును)

బా-నా :—సరే. నీ పనులయందు జాగ్రత్తగలిగి వర్తింపుము.

బా-వ :—అమ్మా! నాకు సెలవు.

బా-నా :— అయ్యో! నాయనా! ఎంతకాలమునుండియో యిట్టి యిక్కట్టుల కలవాటుపడిన నా కనుల కరవునీర నీ విందుండిన సంతోషదాయకము. గాని కర్తవ్యము తొంగరపెట్టుచున్నది.

బా-వ :—తల్లీ! నమస్కారము. (అని నమస్కరించును.)

బా-నా :—శీఘ్రమునసే నీ మనోరథము సిద్ధించునుగాక.

(తెర పడును)

రెండవ రంగము—ఉద్యానవనము.

(మరాణీ తంబళ్ళపెద్దు ప్రవేశించును.)

మ :—అరే పెద్దా! తంబళ్ళ వీరయ్య యేమిచేయుచున్నాడు?

పె :— ఏమిచేయును? పువ్వులతో తివాసీ, దిండు, అంగీ తయారుచేసి పంపించినాడు (అని ఇచ్చును)

మ :— పుచ్చుకొని సంతోషముతో) ఒలే పసందుహువా! ఇట్టి సుందరంబుగ తయారుచేసిన నిర్మాతయొక్క విశ్వకర్మకాని మరొకడు లేడు. (సంగుదగ్గరకువెళ్ళి పదివేలు మొహారీ లిమ్మన్నానని తెచ్చుకో

పె :— మంచిది. మహారాజా! (పెద్ద నిష్క్రమించును)

మ :— పుష్పతివాసీపయి కూర్చుండి దిండు నానుకొని హుక్కా పట్టుచు పరమానందములోనుండును. మనోహర వేషముతో బాలనాగమ్మ ప్రవేశించును.) చూచి (తనలో) ఓహోహో! ఈ మోహన దేవతరూపము - ఆ కన్నులయాదలి చంచలపుచూపు స్త్రీల చిత్తములు క్షణక్షణము మారుచుండును. ఒకసారి భూషింతురు - ఒకప్పుడు దూషింతురు - మరొక్కపుడు ప్రేమింతురు - ఇంకొకప్పుడు కోపింతురు - వేరొకప్పుడు ఆశ పెట్టుదురు - మరొకమారు నిరాశగనబరతురు - ఆడింతురు - పాడింతురు వేయేల? పరస్త్రీలబొందగోరు కాముకునకు దశావస్థలు తప్పవు. ఈ బాలనాగు ఇంతశృంగారముగా సలంకరించుకొని ఎన్నడును గానుపించలేదు మనంబున నేమియోచన బుట్టినదో తెలియవలెను. (సమీపించి) బాలనాగూ! ఇంతఒయ్యారముగా ముస్తాబయినావేమి?

బా :— కాకూడదా?

మ :— కావలసినదే. మలినాంబరధారివై, సంస్కారహీనంబున గురులు చిక్కులుకట్టి జడగట్టి సతతము విచారించుచుండు నీవు శృంగారించుకొనుట వింతగ దోచినది. నాగూ! విను.

సీ. ఇంతలంతలుగావు ♦ ఇంద్రుని వలపించు
కలిత కటాక్షమే ♦ కన్నుదోయి
తళతళ ల్మెరపించు ♦ ధవళకాంతుల నేలు
ముత్యాలకోవలు ♦ ముదితరదము
లూర్మిజాలంబుల ♦ నూగించి యూగించి
లీలహాసించుక ♦ లితప్రియంబు
రాజరాజవిరాజ ♦ భ్రాజిత్తత్ శ్వరంబు
పాలింపజూచును ♦ పాణితలము

గీ. అహాహా ! నీ బోటి బోటి యి ♦ య్యవనియందు
లేదు స్వర్గంబునందున ♦ లేదు నిలయ
మందు లేదు లేదు దిగీశు ♦ మందిరముల
నీకు సాటి లేదు జగాన ♦ నీరజాక్షి.

బా :—ఏమి ఈ కవిత్వమాధుర్యము? ఎక్కడ సంపాదించితివి?

మ :—మంత్రిశాస్త్రము నా పాలి సొమ్ము. మీా సంస్కృతము నాకు బాగుగ తెలియును. ఆంధ్రము నాకు ఇలవేల్పు. ఇవి అవి అననేల సకలవిద్యలు నా కవగతంబు.

బా :—అందుచేతనే నీవి మహాదైశ్వర్యసంపన్నుడవగుట.

మ :- (తనలో) ఏమిచెప్పుమా నన్నింతగ బొగడుచున్నది కారణము దురూహ్యముగానున్నది. "నారీహృదయ స్థితం" అని చెప్పినారు. ప్రయత్నించి చూతును. (ప్రకాశముగా) బాలనాగూ! నీ శ్లేషాలంకారవచనంబులు శ్రోత్రపీయూషంబులు (వెడనవ్వునవ్వును)

బా :—ఏమి నీ పొగడికతీరు. (తనలో) ఏ ప్రసంగంబున వీని గుట్టు నాకు తెలియును? (ప్రకాశముగా) నీ వెంతటికైన తగినవాడవే?

మ :—అందుచేత నేమన కిద్దరకు - (అని దగ్గరకు చేరబోవును)

బా :— జాగ్రత్త దగ్గరకువచ్చెదవు. ఇంక తొమ్మిదిరోజులు మాత్రము వ్యవధియున్నది. అందుచే జాగ్రత్తగా విలాసంబు, నానందంబు నలవరచుకొనగోరి యిట్లు అలంకరించుకొంటిని.

మ :— (పెద్దగా నవ్వుచు) నాపై దయవచ్చినదన్నమాట. బోలో ఏక్-దో-తీన్-చార్-పాంచ్-ఆఠే తొమ్మిదిరోజులు... తొమ్మిది రోజు లోర్చుకొనలేనా ?

మ :—(నొసటిపై చేతివ్రేళ్ళతో కొట్టుకొనుచు) ఇది నా నశీబ్ నశీబ్ - బలత్కారమున భోగిస్తే తిట్టుతగులుతుందిలనే భయం. ఎన్నాళ్ళకు నాపై అనుగ్రహం కలిగింది. సంతోషం సంతోషం.

బా :—(నవ్వును)

మ :—బలేనవ్వు - షోకైన నవ్వు - అనురాగగుంభితమైననవ్వు రదనకాంతులు ముఖమండలమున బ్రసరింపజేయుచు వింతసౌందర్యం బుగలిగించు నవ్వు - కాముకీ కాముకుల కలయికనందలి హావ భావ చేష్టల బ్రకటించు నవ్వు - అనిర్వాచ్యమైన యానందముత్పన్నమగు నవ్వు - నా జన్మమధ్యమం దెన్నడిట్టి నవ్వు - కని విని యెరుంగని నవ్వు నవ్వు.

బా : — (తనలో) వీనికి క్రమేణ కామోద్దీపనము మెండగు చున్నది. (ప్రకా) మరాజీ! —

మ !—ఆఁ! ఎందుకు ?

బా : (ముఖము చిన్నబుచ్చుకొని) చెప్పనా ?

మ :—బాలనాగూ! నా దగ్గర సంకోచమేల ? మన హృదయ ములురెండు ఒక్కటేకదా ? ఆంతరంగికవిషయము చెప్పటకు బిడియ మెందుకు. నీ విచారంచూస్తే నా గుండె బ్రద్దలయిపోవుచున్నది. చెప్పుము.

బా :—ఏమియు లేదు. నీ వనేకమాయలునేర్చినప్రోడవు. పెక్కు భూతములచే సేవలు చేయించుకొను నేర్పరివి ఏ భూతమునకైన నా కోపమువచ్చి ఇట్టే అనిపిస్తే నా బ్రదు కేమికావలెను ?

మ :—(గర్వముతో) ఎంతమాటన్నావు ? నన్ను చంపే భూత ప్రేతపిశాచములుగాని, మానవమాత్రులుగాని లేరు. అరే నా ప్రాణం నా బొందిలో లేదు

బా :—ఐతే నీ వేలాగు బ్రతుకుచున్నావు ?

మ : — అరే నేను బ్రతకడంమాట చెప్పుతాను నీకు నీబొందిలో ప్రాణం ఉన్నదా ?

బా :—లేదు.

మ :—ఎక్కడ ఉన్నది ?

బా :—పానుగంటి పట్నమునకు పడమటిభాగమున పన్నెండు కొమ్మల మర్రిచెట్టున్నది. ఉత్తరపుకొమ్మలో నా ప్రాణమున్నది. ఎవ రైనా ఉత్తరపుకొమ్మ నరికినా నా ప్రాణము పోవును.

మ :—(నవ్వి) హల్కాప్రాణం. నా ప్రాణము యిట్టిదికాదు. గట్టిబందోబస్తులో నున్నది. (నలువైపులు పరీక్షించి) ఎవరైన నున్నా రేమో చూడుము.

బా :—మనమిద్దరముతక్క నెవ్వారు లేరు.

మ :—అరే చెప్పనా ?

బా:—అంతసంశయమున్న చెప్పనక్కర లేదు. (అని పోబోవును

మ :—అరే పోకు పోకు యిచ్చట కూర్చుండుము.

బా : - (కూర్చుండును)

మ :—విను. సప్తసముద్రాలఆవల జీలిగెడ్డ ఆ జీలిగెడ్డలో రాతి గోడ. ఆ రాతిగోడలో రాతికోట, నడుమ ఉక్కుకోట, ఆ ఉక్కుకో టలో ఏనూరు వెలగచెట్లు, మున్నూరు ములగచెట్లు, వీనినడుమ ముంత మామిడిచెట్టు, ఆ చెట్టుతొర్రిలో ఏడు దొంతర్లు అడుగుదొంతరలో బంగారపు పంజరం - ఆ పంజరములో పంచవన్నెలచిలుక - ఆ చిలుక కంఠమందు నా ప్రాణమున్నది. ఆచిలుకకు హానివస్తే నేను చనిపోదును.

బా :—(ఆశ్చర్యముతో) అబ్బా ! ఎంతగట్టిప్రాణము. అందు చేతనే నీ దుండగములు సాగుచున్నవి.

మ :—(నవ్వుచు) ఏమనుచున్నావు ? మరాకీఅంటే సామా న్యుడా ? దేవతలకైన అజేయుడు.

బా :—ఈ రోజున సంతోషకరమైన వార్తవింటిని నిశ్చింతగ నే నుండవచ్చును.

మ :—ఇంకను నీకు సంశయమా ?

బా :—లేదు లేదు. నా మనస్సు కుదుటపడినది. ఇంక నాకు సెలవు సలాం.

మ :—బాలా ! నా సంగతి మరచిపోకు

బా :—ఇంక మరపుకూడనా ? త్వరలోనే సుఖించుకాలము సమీపించినది సెలవు

మ :—అరే సెలవు సెలవు ఏక సెలవు, కొంచెముసేపు నీ మాటలు వినుచుండిన శరీరము పరవశమగుచున్నది.

బా :—ఇంక నెప్పుడు నీ యొడిలోనిదాననే

మ :—అరే సంతోషం సంతోషం.

(తెర పడును)

మూడవ రంగము—సముద్రపు ఒడ్డు. (బాలవర్ధిరాజు ప్రవేశించును)

బా :—ఈ కార్యము సాధించుటకు మానవశక్తి చాలదు. దైవ సాన్నిధ్యములేకున్న ఏ పనియుసాగదు. మరాశిగుట్టు తెలిసికొంటినన్న సంతోషము - ఉత్తుంగమాలికాతరంగజాలంబుల వెల్లివిరియు సముద్రము నిజూచినంతనె పంచబంగాళమైనది. మున్ను శ్రీరామచంద్రమూర్తికి లంకకు దారి చూపించినట్లీ వాహినీపతి నా కేదయిన తెరవుచూపించిన బాగుండును. ఆ మహానుభావుని వంశమునందలివాడనని చెప్పుకొనుటే గాని నా కట్టి సామర్థ్యము లెక్కడివి ? ఓ కాళీ ! ఓ కాళికాపతీ ! తనీన్న యాపదనుండి దాటింపరా ? అయ్యో ! నా తల్లి మరాశికిబెట్టిన మితి తొమ్మిదిరోజులుమాత్రమే కొంతవ్యవధిపెట్టినను బాగుండును.

చ॥ శరనిధిగాంచ భీకరము ♦ సాహసకార్యము చేయరాదులే
గిరివడినం బ్రమాదమున ♦ గ్రుంగుట సిద్ధము నాదురాకకుం
దెరవుకనంగ రాదు జన ♦ నిం జెఱబాయగ జేయజాల, —!
మరణముజెందుటే సుఖము♦మాతకు సౌఖ్యము గూర్పజాలమిన్

సీ॥ నను నమ్మియేకదా ♦ నా జనయిత్రి సా
ధ్వీకి నవర్త్నంబగు ♦ వేషియయ్యె
నను నమ్మియేకదా ♦ నారీశిరోమణి
బరునితో భాషింప ♦ వలసె నేడు

నను నమ్మి రేయేకదా ♦ మనమున జెరభాయు
నను చు బ్రిమోదంబు ♦ నందియుండె
నను నమ్మి రేయేకదా ♦ నాధునింగో గూడి
హర్షాబ్ధి నోలలా ♦ డంగ దలచె
గీ॥ అట్టి మాత మనోవాంఛ ♦ వ్యర్థపరచు
దుష్టచిత్తుండు క్రూరుండ ♦ నిష్టభూతు
డాత్మసామర్థ్యహీను డీ ♦ యవనినేల
బ్రదుకవలయును భూమి భా ♦ రంబుగాక.

ఈ సముద్రుండెంతయు నుత్తుంగభయంకర తరంగముల బరపుచు బహుళగాంభీర్యంబు ప్రకటించుచున్నాడు. ఆ శంకరునికి నాపై దయ రాలేదు. నడచినశ్రమమున శరీరము తూలిపోవుచున్నది. ఆ వటవృక్షచ్ఛాయను కొంతవిశ్రమించెదను. (అని మర్రిచెట్టునీడను కూర్చుండును)

గీ. అల్పబీజంబు బహుళతా ♦ వ్యాపకంబు
సర్వజీవాళికాశ్రయ ♦ స్థానకంబు.
వివిధకోటకలిత వృ ♦ ద్ధ్విరుహంబు
మర్రివృక్షంబు నాకిట ♦ మాన్యరంబు

కన్నులు బరువెక్కుచున్నవి ఇంచుక నిద్రించెద. (పయిమీద బట్ట పరచుకొని పడుకొనును. చెట్టు తొర్రలోనుండి సర్పము బైటకువచ్చి చెట్టు ఎక్కుచుండును. పైగూటిలోని భేరుండపక్షులపిల్లలు కీచుకీచుమని రొదచేయును. నిద్రలో ఆలకించి బాలవర్ధిరాజు లేచి నలుదిక్కుల చూచి పామును తెగ వేయబోవును. పాము మనుష్యరూపుడై—

నా :—కుమారా! నీ చంద్రాయుధము నాపై నేమియు పని చేయజాలదు.

బా-వ :—(నమస్కరించి) మహాత్మా! సర్పరూపుడవైన నీ వెవడవు?

నా :—నేను నాగేంద్రుడను. మదీయవరంబుననే నీ తల్లి బాల నాగమ్మ జన్మించినది. నీవు నాకు దౌహిత్రుడ వయ్యెదవు. నీ శౌర్య

ము పరీక్షింపఁగోరి యిటువచ్చితిని. నీకు శుభమగుగాక.

బా-వ :—మహానుభావా! చింతాతరంగడోలికల నూగులాడు నాకు శుభము లెట్లు కలుగును?

నా.—అన్నియు నీకే గోచరించును. (అని అదృశ్యుఁడగును)

బా-వ :—ఇదియేమియో మాయలాగున్నది. లేక నేను మాయ గోబడి కొట్టుకొనుచున్నానా?

స॥ అటు తల్లింగని శోకభారమును బా ♦ యంజేయలేనంచును
త్కటసంతాపముజెందనా? యలఘు స ♦ స్థయిర్యంబు దూలంగ ప్ర
స్ఫుటగాంభీర్య తరంగమాలికల యొ ♦ ప్పంజూపు వారాశికో
క్క జోహారొనరింపనా? జగతిపై ♦ ఖ్యాతిన్విసర్జింపుచున్.

ఏమిచేయుటకు దోపకున్నది. (తెరలో గొప్పధ్వని, ఆలించి) ఇదియేమి చెపుమా? భయంకరనిర్ఘాతనిస్స్వనంబుంబోలు భీకరారావం బు వినవచ్చుచున్నది. (ఆకాశమువంక చూచి) తుండంబుల నేనుంగు గున్నల గరచుకొని భేరుండంబులు వచ్చుచున్నవి వాని పక్షాఘాత వాతంబుకాబోలు యీ ప్రచండధ్వని. ఈ తరుశాఖమధ్యంబున నీడం బున కిచకిచ ధ్వనులు చేసినవి వీని శాబకంబులుకాబోలు. (నేపథ్య మున) తలితండ్రులారా! మా ప్రాణరక్షకు డీవృక్షంబునీడ నున్నాడు. అతని కార్యంబు సఫలంబుచేయువరకు మా కాహార మక్కరలేదు. ఆ మహానుభావు డిటకురాకున్న మేమీ పాటికి శమనలోకాతిథులమై యుందుము. (కొంతనిశ్శబ్దము తిరిగి తెరలో) కూనలారా! మీ యభీ ష్టమెంత కఠినభూయిష్టమైనను తప్పక చేసితీరెదము. ఆహారము భుజిం పుడు. మా కాకలిలేదు. (మరల తెరలో) మహాత్మా! నీ కార్యము మేము సంపూర్ణము చేసెదము ఇటువచ్చి పిల్లల నాశీర్వదింపుము.

బా-వ :—(నిష్క్రమించి తిరుగ చిలుకతో ప్రవేశించి) ఆహా! దైవానుగ్రహమన్న నిటు లుండవలయును. ఇఁక నా జనని యిక్కట్లు వాసినట్లే. (నిష్క్రమించును)

షష్ఠాంకము—సంపూర్ణము.



# బాలనాగమ్మ

## సప్తమాంకము

మొదటి రంగము—గాండ్లసంగు గృహము.

(గానుగుఆడుచు సంగు ప్రవేశించును.)

సం:— “ఇలవిద్య లెన్నియైనను కులవిద్యకు సాటిరావు” అన్నారు. ఈ మరాఠీసంగతి మారిపోవుచున్నది. ఎల్లకాలము దుండగములు సాగవు. పతివ్రతల యుసురు నూరకపోవునా? అదిగో తంబళ్ళ వీరయ్య వచ్చుచున్నాడు వీఁడు చాలచురుకైనవాఁడు, బుద్ధిమంతుడు, కొద్దిరోజులనుండి కనుపించుటలేదు.

బా-వ:—(ప్రవేశించి) సంగూ! నాకు కొంచెము తెలగపిండి పెట్టెదవా? గానుగ యెద్దును తోలెదను.

సం:—నీవు వలసినంత పెట్టెదను తోలుము.

బా-వ:— (గానుగపైకియెక్కి) ఎద్దును తోలును

(మరాఠీ ప్రవేశించి)

మ:—అరే వీరయ్యా! గానుగ తోలకురా? నా శరీరము తిరిగిపోవుచున్నది,

బా-వ:—గానుగ తిరిగిన నీ శరీరమేల తిరుగును? సంబంధమేమున్నది,

మ :—అరే నాయనా ! నా ఆయువు నీ దగ్గర నున్నట్టున్నది.

బా-వ :—(వినిపించుకొనక గానుగ వడిగతోలును)

మ :—(సోలుచు తూలుచు) అరే నాయనా ! నీకు సలాం చేస్తాను నన్ను రక్షించు.

బా-వ :—(చిలుకను ఒడినుండితీసి చేతితో పట్టుకొనును)

మ :—(చూచి, అరే యీ చిలుక నాదిరా ? నీ కెక్కడనుంచి వచ్చినది ?

బా-వ :— నీ చిలుక రంగు యెట్టిది ?

మ :—పంచవన్నెల చిల్కరా ?

బా-వ :—ఇది నల్లచిలుక నీది కాదు.

మ :—ఇది నాదేరా బాబూ !

బా-వ :—బాలనాగమ్మ నీ కేమగును ?

మ :—నాకు పియురాలు.

బా-వ :—(చిలుక గొంతు నొక్కను).

మ :—(ఊపిరాడక కొట్టుకొనుచు) అరే బాబూ! నాకు తల్లిరా

బా-వ :—నిజము చెప్పుము.

మ :—నీకు సలాంచేసి చెప్తాను నా భూతములు సాక్షిగ - మంత్రవిద్యసాక్షిగ - నా గురువుపాదములు సాక్షిగ -, బాలనాగమ్మ నాకు తల్లిరా.

బా-వ :—పానుగంటిరాజుల శిలలుచేసినావట వారిని తిరిగి మనుష్యులను చేయుము.

మ:—అరే ఎంతఖర్మం, ఎంతఖర్మం నేను మనుష్యులను చేయను,

బా వ :—చేస్తావా ? గొంతుక నొక్కనా ?

మ :—చేస్తా చేస్తా.

బా-వ :— పద పోవుదము. (నిష్క్రమించును)

రెండవ రంగము—నాగళ్ళపూడిగట్టు కార్యవద్దిరాజు డేరా.

(కార్యవద్దిరాజు, పులిపట్నపురాజు, మంత్రి ఇంకాకొందరు ప్రవేశింతురు)

కా-వ :—అయ్యా! తమ యిష్టానుసారము శుభము జరుపు దము కాని—

పు :— సందేహ మేమి ?

కా-వ :—సందియ మేమియు లేదు.

(ఒకవైపున మరాతీయు, ఒకవైపు సంగు మోయుచున్న మేనాలో బాలనాగమ్మ, బాలవద్దిరాజులు ప్రవేశింతురు)

మ :—(మేనాదింపి) అరే అల్లా! ఎంతదుస్థితి సంభవించినది. ప్రశస్తమైన ముసల్మాను వంశమునకు నన్నుంచి దుష్కీర్తి ప్రాప్తించినవి. ఆడదాని సవారీ మోయుటకన్న చచ్చిపోవుట మేలు. చనిపోవు దమన్నను నా ప్రాణము నా బొందిలో లేదు ఏమిచేయుదును,

గీ. మానవతుల కాపురముల ♦ మాయ జేసి
కూర్చినాడ నెన్నెన్నో యి ♦ కుంఠితగతి
నేడు ఈ పాప నా ప్రాణ ♦ నిలయమట్టె
పట్టువేధింపసాగె నా ♦ పాప ఫలము.

ఓ మహాజనులారా ! నా విన్నప మాలింపుడు. లోకంబంతయు నన్నుంచి ఈ నీతి దెలిసికొని పరిపాలించుగాక " చెరపకురా చెడెదవు "

(బాలనాగమ్మ కార్యవద్దిరాజుకు నమస్కరించును)

కా-వ :—బాలనాగూ! ఇచ్చటగల పురుషవర్యులలో నీ యిష్టమువచ్చినవారిని వరించి కాపురము చేసికొమ్ము. కులమున కపకీర్తి దెచ్చిన నీవు నాకు వలదు.

బా-నా :—ఆఁ! ఎంతమాట వింటిని, నే నెంత పతిద్రోహురాలను ? ఎంతదురదృష్టవంతురాలను ? లోకంబున నెంత దుష్కీర్తి గడించితిని. పతిచే నిరాదరణబడసినదానికి నీ దేహధారణ మెందులకు?

ఛీ! బాలనాగమ్మా! జన్మించినది మొదలు కష్టపరంపర లేకాని సుఖలేశమన్నమాటయే లేదు. ఓ తల్లీ! భూలక్ష్మీ దేవీ! నీ వెచ్చటనున్నావు? కష్టసమయమున కంటికి రెప్పవలె రక్షింపుచుండుదానవే? అయ్యో ఇపుడు నాపై దయతప్పినదా? మనోవాక్కాయ కర్మంబున పతిపాదసేవయే కాని యన్యమెరుగదని నా పతితో బల్కరాదా? ఓ ఆకాశవాణీ! నీవైన సత్యము వచింపరాదా? ఓ సూర్యనారాయణమూర్తీ! కర్మసాక్షీ! జగత్కర్తా! నీవైన నా శీలము ధృవపరచరాదా? అయ్యో ఏమి గతి? ఏమి దిక్కు? ఓ మాయలమరాఠీ! నా కొంప దీసితివే. ఓ హుతాశనా! పరమపావనమూర్తీ! నీవు నా ప్రాణనాథుని మనస్సంకోచము వారింపవా? తండ్రీ! నే నేమి యపరాధ మొనర్చితిని. సకలభువనంబులకు కర్తలైన మీరందరు నాపైకట్టు కట్టినట్టు నిజము వక్కాణింపకున్న నాకు దిక్కెవ్వరు? (భర్త పాదములపై బడి) దయాసాంద్రా! ఆత్మసాక్షిగ నీపాద సేవకన్న యితర మెరుగను నన్నన్యధా తలంపకుము

కా-వ:—ఛీ! నీచురాల నా పాదము లంటు చేయకుము పొమ్ము

బా-నా:—(ఏడ్చుచు) అయ్యో! అయ్యో! ఏమి గతి? ఎందు జొత్తును? పతిచే విడువబడి ఎవనిసంతోషముకొరకీ శరీరము భూమిపై నిల్పవలయును? అగ్నిసాక్షిగ నన్ను చెట్టబట్టి నా కొరకే పలుశ్రమలు పడి, యిప్పుడిప్పుడే ముక్తికాంచిన మీ హృదయంబున నట్లు తోచినదా? లేదు లేదు. ఇదిఅంతయు నేను చేసికొన్న పూర్వసంచితార్ధమే? ఓ వైశ్వానరా? సర్వభక్షకా! నీవే నాకు శరణ్యుండవు. నీకన్న చల్లగతరింపజేయువారెవ్వరు లేరు. (భర్త నుద్దేశించి) ఓ ప్రాణవిభూ! నా సతీత్వము దృఢపరచుటకు నగ్నిభట్టారకుండే శరణు. కావున అగ్నిగుండము నిర్మింపుడు,

(తెర ఎత్తగా అగ్నిగుండము కనిపించును,)

బా-నా:—భర్తకు ముమ్మారు ప్రదక్షిణముచేసి అగ్నిగుండమున కెదురుగనిలిచి చేతులు జోడించి)

గీ. త్రికరణంబుల ప్రాణేశు ♦ దివ్యపాద
చింతనముమాని యన్యథా ♦ చింత జేయ
గలుషవర్తన నా యందు ♦ గలిగెనేని
బీకరార్చుల దహియింపు ♦ వీతిహోత్ర.

(అగ్నిగుండమున బడును)

బా-వ :—ఆమ్మా! అమ్మా! ఎంతపని చేసితివి?

కా-వ :—ఇంకెక్కడి అమ్మ కుమారా!

బా-వ :—ఎవని సుఖంబుగోరి నే నింతకష్టపడితినో అదిఅంతయు త్రుటిలో వ్యర్థమయ్యె. నేనుగూడ గుండంబునబడి మడిసెదను, (అని గుండము సమీపమునకు జేరును. నవ్వుచు బాలనాగమ్మ లేచును) (నే పథ్యమున) కార్యవర్ధిరాజా! నీ సతీమణి పరమపతివ్రతాశిరోమణి. సంశయింపక ఏలుకొనుము.

కా-వ :—సుదతీ! నీ డెందంబున కాందోళనంబు కల్పించిన...

బా-నా :—ఎంతమాట. మీ పదదాసి హృదయశోధన జేయుటమంచిదికాదా? భువనంబున నాకిది శ్రేయస్కరంబు.

కా-వ :—(చేయూతయిచ్చి అగ్నిగుండమునుండి తీయును.)

బా-వ :—(తల్లి దండ్రులకు నమస్కరించును.)

ఇరువురు : సుఖీభవ! శీఘ్రమే కల్యాణ సిద్ధిరస్తు.

పు :—పరమపావనులగు మీ బాంధవ్యము నాకు సర్వవిధముల నపేక్షణీయము.

కా-వ :—అవశ్యకర్తము.

బా-వ :—పితరుల యాజ్ఞకు బద్ధుడను. మరాఠీ! నీ దగ్గర మంత్రిపుగుర్రి మున్నదట నా కిచ్చెదవా?

మ :—అది నా ప్రాణము. యుద్ధసమయంబున మంత్రించి విడచిన శత్రువుల రూపుమాపును. నే నివ్వజాలను.

బా-వ :—(చిలుక గొంతుక నొక్కును)

మ:—అయ్యో! చంపకు. చంపకు బాబూ! యిచ్చెదను. (అని మంత్రిపుకర్రిప్రయోగోపసంహారములతో నిచ్చును,)

బా-వ:—గోటుచిప్ప యున్నదట దాని నిమ్ము.

మ:—అది నా రెండవప్రాణము. కోటలుకట్టును. ఏమి కోరినా నవి సమకూర్చును. నే నివ్వను.

బా-వ:—(చిలుక గొంతుకు నొక్కబోవును)

మ:—చంపకు చంపకు (అని గోటుచిప్ప యిచ్చును.)

బా-వ:—ఈ దుర్మార్గునిమూలమునకదా నా తలిదండ్రులకు విపత్తులు కలిగినవి, కావున వీడిక బ్రదికియుండరాదు. (అని చిలుక గొంతు పట్టుకొనును మరాఠీ కాళ్ళు పట్టుకొనును ఇరువురు పెనగులాడుదురు. చిలుక చనిపోవును, మరాఠీ 'అల్లా' అని పడిపోయి చచ్చును)

పు:—నాయనా! మత్కుమారి పాణిగ్రహణముతో గూడ నా రాజ్యభారంబు భరించి సుఖంబున బ్రజల నేలుకొనుము. (అని తన కిరీటముతీసి బాలవర్ధిరాజు శిరంబున నుంచును.)

అందరు:—తదాస్తు.

పు:—అన్నికోర్కెలు సఫలమైనవి. ఇదికూడ సఫలమగుగాక.

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాః సమస్తాస్సుఖినోభవంతు.

మం:—తథాస్తు.

గద్య. ఇది శ్రీశౌనకసగోత్ర పవిత్ర చెరకుపల్లి వెంకటరామ
యార్యకృత బాలనాగమ్మ అను దృశ్యప్రబంధంబు
సర్వంబు నష్టమాంకము సంపూర్ణము.
శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మార్పణమస్తు.

 13 వ పేజీ ౨వ లైనులో 'రాజా సాహేబ్ కో దూసరీ శాదీ' అని చదవుకొనవలెను.

శ్రీరాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి—ఇ. జి. 60—1000 కాపీలు 1946